Photo by K. Arunachalam



బహుమతి
పొందిన వ్యాఖ్య

"చేసే దానం చిన్నదియైనా..."

పంపినవారు :
డా॥ వి. పి. ఆచార్యులు, ముష్పారంఖుర్ద్.

నూతన గెవార్ట్

**GEVAERT**

# ఫొటోగ్రాఫిక్ కాంపిటిషన్

విషయము

## "భారతీయ ప్రజలు, జీవితము"



## రు. 4000 లకు మించిన బహుమతులు

మొదటి నగదు బహుమతి...రు. 1,000

రెండవ నగదు బహుమతి...రు. 750

మూడవ నగదు బహుమతి...రు. 500

నాల్గవ నగదు బహుమతి...రు. 250

5 నుండి 9-వ బహుమతి వరకు ఎ.పి.ఎల్ ఫొటో సరకులకు వోచర్లు... ఒక్కొక్కటి రు. 100

10 నుండి 19-వ బహుమతి వరకు ఎ. పి. ఎల్. ఫొటో సరకుల వోచర్లు... ఒక్కొక్కటి రు. 50

## ఇవిగాక, డీలర్లకు రు. 650/-లు విలువగల బహుమతులు

ముగింపు తేది: 31 జనవరి 1957

బ్రహ్మాండమైన ఈ భరతఖండంలో, ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమరలు—నలుదిక్కులా రకరకాల జను లున్నారు. వారి దుస్తుల విధానాలు, నగల అలంకర ణలు, ఆచార వ్యవహారాలు, ముఖకవళికలు—అన్నీ భిన్నంగా ఉంటున్నవి. భారతదేశపు ఈ ఇంద్ర జాలాన్ని—అనగా వివిధ జనుల వింత జీవనాలను గ్రహించి, ఈ నూతన గెవార్ట్ ఫొటోగ్రాఫిక్ పోటీలో ఒక మంచి బహుమతిని పొందండి. ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చు. ప్రతి ఎంట్రీయున్ను గెవార్ట్ ఫిలింతో తీసి, హాఫ్‌ప్లేటు $4\frac{3}{4}'' \times 6\frac{1}{2}''$ సైజు గెవార్టు పేపరుపై ప్రింటుచేసినదై ఉండవలెను. ప్రతి ఫొటోవెంట ఒక గెవార్టు ఫిలిమ్ కాళీపెట్టెకూడ పంపవలెను. ఫోటోలన్నీ భారతదేశపు ప్రజలు, వారి జీవితములగురించియే ఉండ వలెను. ఈ పోటీనిగురించిన పూర్తి వివరములు మీ సమీపంలో ఉండే గెవార్టు డీలరునుండి తెలుసుకొన వచ్చు. లేదా నేరుగా మాకు వ్రాయండి.

**ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED.**

**ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్,**

(పబ్లిసిటీ శాఖ) కస్తూరి బిల్డింగ్స్, జంషెడ్జీ తాతా రోడ్డు, బొంబాయి-1

(ప్రతి గురువారమూ రాత్రి 8-00 గంటలకు (41 మీటర్ బ్యాండు) సిలోన్ రేడియో విని, ఈ గొప్ప పోటీనిగురించిన వివరములు తెలుసుకోండి.)

'కోడక్' స్నేప్‌షాట్ల ద్వారా **శలవునాటి సరదాను సంవత్సరము పొడుగునా**

మీరు జ్ఞాపకముంచుకోవాలనుకునే సంఘటనలు ఎన్నో శలవు దినములలో జరుగుతాయి. వాటి ఆనందమును చక్కని 'కోడక్' స్నేప్‌షాట్ల ద్వారా మళ్లీ అనుభవించండి.

ఒక 'కోడక్' కెమేరాతో స్పష్టమగు, చిత్రములు తీయుట ఎంతో సులభము. కొన్ని మోడలులలో లెన్సులు ఫ్యాక్టరీలోనే ఫోకసు చేయబడినవి. మీరు పెద్ద వ్యూఫైండర్‌లో దృశ్యమందు లక్ష్యముంచి మీట నొక్కితే చాలును. ధర ఎక్కువా అంటే. రు. 17/8 తక్కువ దరకే ఒక చక్కని 'కోడక్' కెమేరా దొరకుతుంది!

మీ కోడక్ డీలరువద్ద దొరకుతున్న అనేక రకముల సుందరమైన యీ కెమేరాలను చూడండి. మీకు అనుకూలమైన ఒక కెమేరా మీరు కొనాలనుకున్న ధరలో నిశ్చయముగ లభిస్తుంది.





ఉత్తమ చిత్రములకు 'కోడక్' ఫిల్మును వాడండి

కోడక్ లిమిటెడ్ (ఇంగ్లండులో స్థాపితము. కంపెనీ సభ్యుల బాధ్యత పరిమితము)
బొంబాయి-కలకత్తా-డిల్లీ-మద్రాసు

శలవునాడు సరదాగా ఉండండి, మరియు ఆ సమయములను 'కోడక్' స్నేప్‌షాట్ల ద్వారా జ్ఞాపకముంచుకోండి

K. 2375

నమ్మకమైన 'కోడక్' కెమేరాతో మీరు

అంజలీదేవి ఎల్లప్పుడూ

# లక్స్ టాయ్‌లెట్ సబ్బును

వాడుచున్నది

"నాకు తెలిసియున్నట్టి మిక్కిలి తెల్లని మిక్కిలి శుద్ధమైన సబ్బు"

ఈ విషయంలో మీరు ఆమె మాటను విశ్వసింపవచ్చును: లక్స్ టాయ్‌లెట్ సబ్బుయొక్క స్వచ్ఛమైన తెలుపు అంటే శుద్ధత—అనగా మీ చర్మ సౌందర్యమును దివ్యముగా కాపాడునట్టిది—మరియు లక్స్‌యొక్క నురగ: పరిమళమైనది, మీగడవంటిది, అది మీ చర్మమును ఎంతో బాగుగా శుభ్ర పర్చును, దానిని చాలా ఎక్కువ హాయిగా నుంచును. మరి పొదుపు కొరకై, పెద్ద సైజును మరువకుడు:

భారతదేశంలో తయారుచేయబడినది




సినీమా తారలకు సౌందర్యము నిచ్చు సబ్బు

LTS 485.50 TL

# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు



ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.







ఇప్పుడు ప్యారీ కంపెనీవారి
ఉంగరమువంటి పెప్పర్‌మింటులు
దొరకుతున్నాయి







అవి ఎంతో రుచిగా ఉంటాయి కనుక
అవంటే చిన్న పెద్దలకు అందరికీ యిష్టమే!
శుభ్రముగా, ఆరోగ్యకరముగా విలువపుండేలా అవి
నేర్పుగా ప్యాకుచేయబడినవి కనుక వాటి తియ్యని
రుచులు తాజాగా ఉంటాయి!

PRS. 2676

# విచిత్ర కవలలు




పోస్టేజి 0–2–0 అదనము
1–8–0 పంపిన కాపి రిజిస్టర్డు ద్వారా పంపబడును.
ఏజెంట్లకు మామూలు కమిషన్

★ ★ ★

చందమామ పబ్లికేషన్సు
మదరాసు - 26




నాణ్యమునకు పేరుపొందిన

## చాంపియన్

కలమునే ఎల్లప్పుడు కొనండి.
ప్రతిచోట దొరకును.

వెల రు. 3-8-0 నుండి పైగా

★

గుజరాత్ ఇండస్ట్రీస్,
బొంబాయి - 2.




★ ★ ★

The Choice of all

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

చందమామ పబ్లికేషన్సు,
వడపళని, మద్రాసు - 26

పొందండి

కొన్ని జనప్రియమైన 'కోడక్' కెమేరాలు



'బ్రౌనీ' 127 కెమేరా రు. 17/8



సిక్స్-20 'బ్రౌనీ' కెమేరా, మోడలు 'సి' రు. 24/-



'బ్రౌనీ' రిఫ్లెక్స్ కెమేరా రు. 45/-



సిక్స్-20 కోడక్ 'జూనియర్ II' కెమేరా (f/6.3 లెన్సు) రు. 115/-



కోడక్ 'రెటినెట్' కెమేరా (f/3.5 లెన్సు) రు. 250/-

ధరలలో అమ్మకపు పన్ను చేర్చబడలేదు

ఎల్లప్పుడూ మంచి చిత్రములను తీయగలరు!




## SAPAT
## Lotion & Malam




గత 50 సంవత్సరాలకు పైగా —తామర, గజ్జి, చిడుము వ్యాధులకు అమోఘ మైనదని ప్రసిద్ధి గాంచినది.

**సపట్ అండ్ కో., బొంబాయి-2**

ఆంధ్రాకు ఏజంట్లు :

ది ట్రేడ్ ప్రమోటింగ్ కార్పొరేషన్

విజయవాడ - 2

RPC


## చందాదారులకు మనవి



పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లైయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లైయింట్లు గమనించబడవు.

మేనేజరు





**ఆంధ్రుల చరిత్ర సంస్కృతి**

ప్రతి ఆంధ్రుడు చదువ దగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు. 6 0 0




**బాలసరస్వతి పిక్టోరియల్ మీడియం డిక్షనరి**

( ఇంగ్లీషు—ఇంగ్లీషు—తెలుగు )

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ వుపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తికాలికో బైండు

| | |
|---|---|
| మీడియం ధర | 9 0 0 |
| జెం డిక్షనరీ ధర | 4 8 0 |




**గానకళాబోధిని**

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దలకు ఉపయుక్తపడు గ్రంథరాజము.

పే. 1000. రు. 10 0 0

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపగలరు.

వలయువారు : **బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.**

బ్రాంచి : నెం. 6, సుంకురామచెట్టి వీధి, మద్రాసు-1

ఏ విధమయిన అచ్చుపనులైనను
అతి చక్కగా...
అనుకొన్న గడువులో
మేము చేసి యివ్వగలము!

★

మా ముద్రణశాఖకు తోడుగా చిత్రకళాశాఖ,
బ్లాకు తయారీశాఖ, లితో-అఫ్‌సెట్
సంస్థలు సమకూడి వున్నవి.

★

ది బి. ఎన్. కె. ప్రెస్
(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

ఫోన్: 88474




**ఆరోగ్యవంతులైన జనులు ప్రతిరోజూ**
**లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు**

**- అది ప్రతిదిన * మలినములోని**
**క్రిములను కడిగివేయును!**

* మనకు ప్రతిదినం తాఱ్పడే మామూలు మురికిలో క్రిములున్నాయి. మనలో ప్రతివారికీ యీ క్రిములవల్ల రోగాల ప్రమాదం వుంది. అందుచేతనే చాలమంది ఆరోగ్యవంతులగు జనులు లైఫ్‌బాయ్ సబ్బుతో మురికిని మరియు క్రిములను రోజూ కడిగివేసుకొనుటవల్ల తమ ఆరోగ్యమును కాపాడుకొనుచున్నారు — అది ఆరోగ్యవంతమైన హాయిని గలిగించును.

L. 261-50 TL

భారతదేశంలో తయారుచేయబడినది



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

మన జాతీయ విమోచనోద్యమం ఎన్ని రంగాలలోనో నడి
చింది. ఎందరో మహనీయులు ఆ ఉద్యమాన్ని నడిపించారు.
అటువంటివారిలో ఒకరు లోకమాన్య బాలగంగాధర తిలక్.
ఆయన శత జన్మదినోత్సవం దేశమంతటా జరపబడుతున్నది.
ఈ వీరపూజలో మనంకూడా పాల్గొందాం!

అతి విచిత్రమైన సింద్‌బాద్ నౌకాయానాల కథలు ఎన్నో
తరాలవారిని ఆకర్షించాయి. ఆబాలగోపాలాన్నీ ఆనందింపజేయ
గల ఈ కథలు ఈ సంచికనుండీ ఆరంభమవుతున్నాయి. వీటికి
సంబంధించిన ప్రస్తావన కిందటి సంచికలోనే ప్రచురించాం.
ఈ కథలను వరసగా 'చందమామ'లో చదవండి.

పాలకులు యుక్తిమంతులైనట్టయితే హింసాయుతమైన దురా
చారాలను అహింసద్వారానే రూపు మాపవచ్చునని, "దురాచారం"
(జాతక కథ) స్పష్టం చేస్తోంది. హింసను అవలంబించేవారు, అది
తమమీదికి వచ్చేదాకా, దానిలో ఉండే దౌష్ట్యాన్ని అర్థంచేసుకోలేరని
కూడా ఈ కథ రుజువు చేస్తోంది.

సంచిక 2

ఆగస్టు 1956

సంపుటి 19

CHITRA

# అట్టమీది బొమ్మ

ద్రౌపదిని సైంధవుడు బలాత్కారంగా తన రథంమీద తీసుకునిపోతున్న సమయంలో, అడవిలో వేటకు వెళ్లిన పాండవులకు దుశ్శకునాలు కలిగాయి. వారు వేట చాలించి తిరిగి వచ్చి, జరిగిన సంగతి తెలుసుకున్నారు.

వెంటనే పాండవులు అయిదుగురూ తమ రథాలమీద బయలుదేరి, అతి వేగంగా సైంధవుడి బలాలను చేరుకున్నారు. పాండవులకూ, సైంధవుడి అనుచరులకూ ఘోరయుద్ధం జరిగింది.

తనకు అపజయం తప్పదని సైంధవుడికి తెలిసిపోయింది. వాడు తన రథంమీదినుంచి ద్రౌపదిని కిందికి దింపి, రథం తోలించుకుని పారిపోయాడు.

ఈలోపుగా పాండవులు సైంధవుడి బలాలను పూర్తిగా నాశనంచేసేశారు. భీమార్జునులు సైంధవుడికోసం చూసి, అతడు పారిపోయాడని తెలుసుకుని, అతనికోసం ఒక రథంలో బయలుదేరారు. వారు పోయేటప్పుడు ధర్మరాజు, "సైంధవుణ్ణి ఏమైనా చెయ్యండిగాని, చంపవద్దు!" అని హెచ్చరించాడు.

ఒక కోసుదూరం వెళ్లాక భీమార్జునులకు సైంధవుడి రథం కనుచూపు మేరలోకి వచ్చింది. వారు దూరంనుంచే ఆ రథం గుర్రాలను బాణాలతో కొట్టేశారు. రథం దిగి కాలిబలంకొద్దీ పారిపోతున్న సైంధవుడు వారికి చిక్కిపోయాడు. భీముడు అతన్ని కసితీర చిత్రహింస చేసి, చంపబోతుండగా అర్జునుడు, అన్న చెప్పినమాట జ్ఞాపకంచేసి అతన్ని వారించాడు.

భీముడు సైంధవుడికి పంచశిఖలు పెట్టి, "ఓరీ, నీచాధముడా! నువు వెళ్ళినచోటనల్లా పాండవుల దాసుణ్ణి అని చెప్పుకు తిరుగు. అలా అయితే నిన్ను ప్రాణాలతో వదిలేస్తాను!" అన్నాడు. ప్రాణభయంచేత సైంధవుడు, భీముడు చెప్పినదానికి అంగీకరించాడు.

ఇంత పరాభవం చెందిన సైంధవుడు హిమాలయాలకు వెళ్ళి శివుణ్ణి గురించి ఘోరతపస్సు చేశాడు. శివుడు మెచ్చి ప్రత్యక్షమై, "ఏం వరం కావాలో కోరుకో!" అన్నాడు. "మహాదేవా, పంచపాండవులందరూ నాచేతిలో ఓడేటట్టు వరమియ్యి!" అని అడిగాడు సైంధవుడు. "వెర్రివాడా, అర్జునుడికి నేను పాశుపతాస్త్రం ఇచ్చి ఉన్నాను. అతన్ని ఎవరూ ఓడించలేరు. మిగిలిన నలుగురూ ఒక్క రోజు నీచేత ఓడేటట్టు వరం ఇచ్చాను, వెళ్లు!" అన్నాడు శివుడు.



# అర్ధణా రాజు

పాటలీపుత్రనగరంలో ఒక పేదవాడుండే వాడు. వాడు నీళ్లుమోసి జీవితం వెళ్లబుచ్చు తూండేవాడు. వాడుండేది నగరపు ఉత్తర ద్వారంవద్ద. ఆ నగరం దక్షిణద్వారానికి సమీపంలో ఒక స్త్రీ ఉండేది. ఆమెకూడా నీళ్లబిందెలు మోసి జీవయాత్ర గడుపు తున్నది. ఈ ఇద్దరికీ స్నేహం కుదిరి పెళ్లి చేసుకున్నారు.

పెళ్ళిచేసుకున్నప్పటికీ ఇద్దరూ నగరం చెరొకమూలా పనిచేస్తూ ఉండటంవల్ల తరుచు ఒకరినొకరు చూసుకునేవారుకారు.

ఇలా ఉండగా ఒకరోజు ఏదో పండగ వచ్చింది. నీళ్ళు మోసేవాడు తన పని త్వరగా ముగించుకుని దక్షిణద్వారందగ్గిర ఉండే తన భార్యను చూడబోయాడు.

"ఇవాళ పండగరోజు. అందరూ పండగ చేసుకుంటారు. మనం మాత్రం చేసుకోవద్దా? నాదగ్గిర అర్ధణా ఉన్నది. నీదగ్గిర ఏమాత్రం ఉన్నది?" అని భార్య అడిగింది, తన అర్ధణా చూపుతూ.

"నాదగ్గిరకూడా అర్ధణా ఉంది. దాన్ని ఉత్తరద్వారంవద్ద గోడలో ఇటుకల సందున జాగ్రత్తగా దాచిఉంచాను," అన్నాడు భర్త.

"చాలు. అందులో ఒక కానీపెట్టి పూలు కొందాం. ఇంకో కానీకి చందనం కొందాం. మిగిలిన అర్ధణాతో పాయసం కాచుకు తాగుదాం!" అన్నది భార్య.

ఈ మాటలకు నీళ్ళుమోసేవాడు పరవశుడైపోయాడు. తానూ, తన భార్యా కలిసి పండగ చేసుకుంటున్నామన్న ఆనందంలో వాడికి వళ్ళు తెలియలేదు. "నువ్విక్కడే ఉండు. నేనిప్పుడే ఉత్తర ద్వారానికి వెళ్లి నా అర్ధణాకూడా తెస్తాను!" అంటూ వాడు బయలుదేరాడు.

మిట్టమధ్యాన్నం కావస్తున్నది. నెత్తిన ఎండ మండిపోతున్నది. కింద దారివెంబడి

వి. నాగభూషణం

ఇసుక నిప్పులుచెరుగుతున్నది. కాని అసందంలో, నీళ్ళుమోసేవాడికి ఎండా తెలియలేదు, వేడీ తెలియలేదు. వాడు ఉత్సాహంగా గెంతుతూ, పాడుతూ ఉత్తరపు ద్వారంకేసి పోతున్నాడు.

రెండు ద్వారాలకూ మధ్య మార్గంలో రాజుగారిమేడ ఉన్నది. రాజు పైఅంతస్తులో నిలబడి చూస్తూంటే, ఎండను లక్ష్యపెట్టకుండా, కాళ్లు కాలుతున్న సంగతి కూడా తెలియకుండా, పాడుతూ పోతున్న నీళ్ళుమోసేవాడు కనిపించాడు. రాజుకు వాణ్ణి చూసి ఆశ్చర్యమయింది. వాడి ఆనందానికి కారణమేమిటో తెలుసుకుందామని, ఆయన నౌకర్లను పిలిచి, "ఆ పాడుతూ వెళ్లేవాణ్ణి నా దగ్గిరికి పట్టుకురండి," అని అజ్ఞాపించాడు.

భటులు వెళ్లి నీళ్లుమోసేవాడితో, "ఏయ్, రాజుగారు రమ్మంటున్నారు, రా!" అన్నారు.

"నాకు రాజుతో ఏం పని? నేనాయన నెరగను," అన్నాడు నీళ్ళు మోసేవాడు, తన దారిన తాను వెళ్లటానికి సిద్ధపడుతూ.

రాజభటులు వాణ్ణి పట్టుకుని బలవంతాన రాజుదగ్గిరికి ఈడ్చుకువెళ్ళారు. రాజుగారు వాణ్ణిచూసి, "ఏమోయ్, పైన నెత్తీ, కింద కాళ్ళూ మాడుతున్నా లెక్కచెయ్యకుండా ఎక్కడికి పోతున్నావు?" అని అడిగాడు.



"అయ్యా, నా గుండెలో ఇంతకన్న వేడి అయిన కోరిక ఉండటంవల్ల నాకు ఈ ఎండవేడి తెలియటంలేదు," అన్నాడు నీళ్ళు మోసేవాడు.

అదెంత గొప్ప కోరికో అనుకుంటూ రాజు, "ఏమిటా కోరిక?" అని అడిగాడు.

"అయ్యా, ఇవాళ పండగ. నా భార్య దగ్గిర అర్ధణా ఉన్నది. నేను ఉత్తరద్వారం పద్ద గోడలో ఇటుకల సందున అర్ధణా దాచుకున్నాను. ఇద్దరి డబ్బులూ కలిసి అణా అవుతే, అందులో కానీకి పూలూ, కానీకి చందనం కొని మిగిలిన అర్ధణాతో పాయసం వండుకుని ఇద్దరమూ హాయిగా పండగ చేసుకుంటాం. అందుకే బయలు దేరాను. నేను నా అర్ధణా తీసుకుని తిరిగి దక్షిణద్వారానికి వెళ్ళాలి. అప్పుడు పండగ చేసుకోవాలి. నా భార్య కాచుకుని ఉన్నది. అందుచేత త్వరగా నన్ను పోనివ్వండి," అన్నాడు, నీళ్లుమోసేవాడు.

ఇది విని రాజు నివ్వెరపోయాడు.

"ఇంకా వచ్చినంత దూరం వెళ్లితేగాని ఉత్తరద్వారం రాదు. దానికి రెట్టింపు నడిస్తేగాని మళ్ళీ దక్షిణద్వారానికి చేరు కోవు. ఎందుకంత శ్రమ? నేను అర్ధణా ఇస్తాను. నీ భార్యవద్దకు తిరిగిపోయి పండగ చేసుకో!" అన్నాడు రాజు.



"చిత్తం! తమరిచ్చే అర్ధణా తీసుకుంటాను; నా అర్ధణా కూడా తెచ్చుకుంటాను," అన్నాడు నీళ్ళుమోసేవాడు.

"ఆ అర్ధణాకోసం ఎందుకు మధనపడతావు? కావలిస్తే పావలా ఇస్తాను. తీసుకుని తిరిగిపో," అన్నాడు రాజు.

"చిత్తం! పావలా ఇప్పించండి. నా అర్ధణాకూడా తీసుకుని తిరిగిపోతాను," అన్నాడు నీళ్ళుమోసేవాడు.

రాజుకు పట్టుదల వచ్చింది. ఎంత ఇస్తే వాడు ఆ అర్ధణాను మరిచిపోతాడో చూస్తామని ఆయన వాడికి ఒక రూపాయిదగ్గిర నుంచి లక్షరూపాయలదాకా ఇస్తానంటూ వెళ్ళాడు. ఎంత ఇచ్చినా వాడు తన అర్ధణాను తీసుకోనిమ్మని బతిమాలసాగాడు.

చివరకు రాజు విసిగి, "నువా అర్ధణా తీసుకోకుండా ఉండేట్టయితే సగంనగరానికి ఇప్పుడే నిన్ను రాజుచేస్తాను. ఏమంటావు?" అని అడిగాడు.

"చిత్తం! అలాగే చెయ్యండి!" అన్నాడు నీళ్ళుమోసేవాడు.

వెంటనే రాజు మంత్రికి కబురుచేసి, "వీణ్ణి సగంనగరానికి రాజుచేస్తూ పత్రం రాయండి," అన్నాడు.

నగరాన్ని మంత్రి ఉత్తర దక్షిణ భాగాలుగా విభజించాడు. "అందులో ఏ సగం కావాలో కోరుకో. ఆప్రకారం మంత్రిగారు పత్రం రాసేస్తారు! ఆ సగంలో నువు రాజ్యం ఏలవచ్చు," అన్నాడు రాజు.

"చిత్తం! నాకు ఉత్తరపు సగం ఇప్పించండి!" అన్నాడు నీళ్ళుమోసేవాడు. ఉత్తరద్వారందగ్గిర దాచుకున్న అర్ధణా కోసమే వాడు అలా కోరాడని అందరూ అనుకున్నారు.

రాజు అన్నమాట ప్రకారం నీళ్ళుమోసేవాణ్ణి ఉత్తరనగరానికి రాజుచేశాడు. కాని ప్రజలు ఈ రాజును "అర్ధణారాజు" అని మాత్రమే పిలిచేవాళ్లు.





# దురాచారం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు బ్రహ్మదత్తుడి కుమారుడుగా జన్మించాడు. అతనికి బ్రహ్మదత్త కుమారుడని పేరు పెట్టుకున్నారు. అతను తక్షశిలకు వెళ్ళి పదహారేళ్లు నిండే లోపునే మూడు వేదాలూ, వేదాంగాలూ, ఉపనిషత్తులూ చదివాడు. అతను విద్య చాలించి తిరిగిరాగానే రాజు అతనికి యౌవ రాజ్యాభిషేకం చేశాడు.

ఆకాలంలో కాశీరాజ్యంలో ప్రజలు అనేక దేవతలను పూజించేవారు. అనేక జాతరలు చేసేవారు. జాతర జరిగినప్పుడల్లా గొర్రెలనూ, మేకలనూ, కోళ్లనూ దేవతలకు బలియిచ్చి, వాటి రక్తం నైవేద్యం పెట్టేవారు. బ్రహ్మదత్త కుమారుడు ప్రజల మూఢ విశ్వాసాలనూ, దురాచారాలనూ చూసి చాలా బాధపడేవాడు. "నేను రాజునయాక ఈ దురాచారాలనన్నిటినీ, ఒక్క చుక్క రక్తం రాల్చకుండా నిర్మూలిస్తాను," అని అతను ఆలోచన చేశాడు.

కాశీనగరం వెలపల ఒక మర్రిచెట్టుండేది. ఆ చెట్టులో ఒక దేవత ఉన్నదనీ, మొక్కుకున్నవాళ్ళకు ఆ దేవత పిల్లలనిస్తుందనీ, ఇతర కోరికలేవైనా ఉంటే ఈడేర్చుతుందనీ ప్రజలు నమ్మేవాళ్ళు.

ఒకనాడు బ్రహ్మదత్త కుమారుడు రథమెక్కి ఊరువెలపల ఉన్న మర్రిచెట్టు వద్దకు వెళ్ళాడు. ఆ చెట్టుచుట్టూరా అనేక మంది స్త్రీలూ పురుషులూ భక్తితో ప్రదక్షిణాలు చేస్తున్నారు. చెట్టుకు అంతదూరంలోనే యువరాజు రథం దిగి, చెట్టును పూలతో పూజించి, చెట్టుచుట్టూ మూడు ప్రదక్షిణాలు చేశాడు. ఆ తరవాత అతను తన రథమెక్కి ఊళ్ళోకి తిరిగి వెళ్లిపోయాడు. అది మొదలు అతను తరుచు

అ మ(ర్రిచెట్టువద్దకు వెళ్ళి, క్షుద్రదేవతలలో విశ్వాసంఉండే మామూలు మనుషులలాగే చెట్టును పూజిస్తూ, దానిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ రాసాగాడు.

కొంతకాలం ఇలా గడిచాక ముసలి రాజు చనిపోయాడు. బ్రహ్మదత్త కుమారుడు కాశీరాజ్యానికి రాజయాడు.

రాజ్యాభిషేకం అయినవెంటనే అతను నిండు పేరోలగం ఏర్పాటుచేసి అందులో ఈ విధంగా మాట్లాడాడు:

"నేను రాజు నెలా అయానో మీరెవరూ ఎరగరు. కాని, యువరాజుగా ఉన్న కాలంలో నేను ఊరిబయట ఉండే మర్రి చెట్టును పూజించివస్తూఉండిన సంగతి మీరెరిగే ఉంటారు. నన్ను రాజును చేసినట్టయితే ఆ మర్రిచెట్టుకు వెయ్యి జీవాలను బలిఇస్తానని మొక్కుకున్నాను. నా కోరిక ఈడేరింది. అన్న మాటప్రకారం మర్రిచెట్టుకు బలి జరగాలి!"

ఈ సంగతి వినగానే సభికులంతా పరమానందభరితులయారు. మంత్రులు, "మహారాజా, తాము మర్రిచెట్టుకు ఏ జంతువులను బలి ఇస్తామనుకున్నారో సెలవిప్పించండి. వెంటనే అన్ని ఏర్పాట్లూ చేయిస్తాం!" అన్నారు.

"నేను బలియిస్తానని మొక్కుకున్నది జంతువులను కాదు—దేవతలకు జంతువులను బలియిచ్చే మనుషులను. అటువంటి వారిని వెయ్యిమందిని తీసుకురండి. నా మొక్కు చెల్లించుకుంటాను. ఈ రోజు లగాయతు ఎవరెవరైతే దేవతలకు బలులిస్తారో, వారు మర్రిచెట్టుకు బలిచేయబడతారని దేశమంతటా చాటింపించండి," అన్నాడు రాజు.

సభికులు నిర్విణ్ణులైపోయారు. కాని వారు బలులలో నమ్మకం ఉన్నవారేగనక ఏమీ అనలేక పోయారు. దేశమంతటా చాటింపు జరిగింది. అదిమొదలు ఇంద్రజాలంలాగా కాశీరాజ్యంలో జంతుబలులు లేవు!






## 14

[శివదత్తుడూ, మందరదేవుడూ వున్న పడవలు రాత్రివేళ ఒకానొక ద్వీపాన్ని చేరినై. ఎక్కడినించో హఠాత్తుగా రివ్వుమంటూ వచ్చి, ఒక రాయి సైనికుణ్ణి తాకింది. మందరదేవుడు అటుకేసి బాణం వదిలాడు. వెంటనే వికృతమైన కేక వినబడింది. తెల్లవారి ఆ ప్రదేశంలో పచ్చని చెట్ల ఆకులపై, ఎర్రని నెత్తురు మరకలు కనిపించినై. తరవాత—.]

శివదత్తుడూ, మందరదేవుడితోపాటు, సైనికులుకూడా, ఆకులపై కనిపించిన ఎర్రని నెత్తురు మరకలను చూచి, నిర్విణ్ణులైపోయారు. రాత్రి వినబడిన వికృత కంఠధ్వని, మనిషిదే అయివుంటుందని, అందరికీ అర్థమైపోయింది.

"ఇది మానవరక్తం, సందేహం లేదు!" అన్నాడు శివదత్తుడు, వాటిని పరీక్షించి చూస్తూ. "నేను అనుమానించినట్టు ఆ వ్యక్తి గాయపడ్డాడేగాని మరణించ లేదు. ఇక్కడినుంచి పారిపోయి వుంటాడనేందుకు కూడా సందేహంలేదు. ఎందుకైనా మంచిది, యీ చుట్టుపక్కల పరీక్షిద్దాం."

మందరదేవుడూ, ముగ్గురు సైనికులూ ఒకవైపుకూ, శివదత్తుడూ మిగిలిన ముగ్గురు సైనికులూ మరొకవైపుకూ బయలుదేరారు. మందరదేవుడు కొంతదూరం వెళ్ళేసరికి ఎదురుగా వున్న పొదలో ఏదో కదిలిన అలికిడి అయింది. వెంటనే అతడికి తను వెతుకుతున్న శత్రువు దొరికినట్టనిపించి, ముందుకు దూకాడు. కాని, ఆ అలికిడి చేసినది మనిషి కాదు; ఒక అడవిపంది. అది



అరుస్తూ మందరదేవుడిని తన కోరలతో చీల్చేందుకు పొదలోంచి బయటకు దూకింది. మందరదేవుడు అంతలో నివ్వెర పోయి, దాని కోరలనుంచి పక్కకు తప్పుకుని, కత్తితో దానిని ఒక్కపోటు పొడిచాడు. ఆ దెబ్బకు అడవిపంది బాగా గాయపడినా, అరుస్తూ వెనక్కి తిరిగి అతడిమీదికి వురికింది. ఈలోపల మందరదేవుడి వెంట వున్న సైనికులు దానిని తమ కత్తులతో పొడిచారు. అది ఘీంకరిస్తూ పక్కకు పడి గిలగిల తన్నుకోసాగింది.

ఇంతలో శివదత్తుడు సైనికులతో పరిగెత్తుతూ అక్కడికి వచ్చాడు. అతడికి గాయపడి తన్నుకుంటున్న అడవిపందీ, పక్కనే నిలబడివున్న మందరదేవుడూ కనిపించారు. "మీ కేకలు విని ఏదో ప్రమాదం జరిగిందని పరిగెత్తుకుంటూ వచ్చాను," అన్నాడు శివదత్తుడు నవ్వుతూ.

"అనుకోకుండా ఆహారం సంపాదించాం. రాత్రి మనమీదకు రాయి విసరిన శత్రువెవడో తరవాత చూచుకోవచ్చు. ముందు ఆకలి తీర్చుకోవటం అవసరం," అన్నాడు మందరదేవుడు.

సైనికులు ఆ చుట్టుపక్కల దొరికే ఎండు పుల్లలు పోగుచేసుకు వచ్చేందుకు తలా ఒకవైపుకు వెళ్ళారు. మందరదేవుడూ,



శివదత్తుడూ నిప్పు వెలిగించి మంట చేస్తున్నారు. అంతలో దూరాన్నుంచి వాళ్ల కర్ణపుటాలు బద్దలయేలాంటి భయంకర ఆర్తనాదం వినబడింది.

ఆ శబ్దం వింటూనే ఒక్క గంతున శివదత్తుడూ, మందరదేవుడూ లేచి కత్తులు దూసి ఆ ఆర్తనాదం వచ్చినవైపుకు పరిగెత్తారు. కొంచెందూరం వెళ్ళేసరికి వాళ్ళ కంటబడిన దృశ్యం, భయాశ్చర్యాలను కలిగించింది.

అంతలో "నరవానరం, నరవానరం!" అని కేకలు వేస్తూ కొందరు సైనికులు అటుకేసి పరుగెత్తుకుంటూ వచ్చారు.

ఇంతకూ అక్కడ జరిగినదేమిటంటే: ఎండుపుల్లలు ఏరుతున్న ఒక సైనికుడి కంఠాన్ని హఠాత్తుగా వెనుకనుంచి రెండు బలమైన చేతులు పట్టుకున్నాయి. భయకంపితుడైన ఆ సైనికుడు ఓపికకొలదీ గొంతెత్తి కేకలు పెట్టాడు.

"ఇది నరవానరం, సందేహం లేదు!" అంటూ మందరదేవుడు కత్తితో ఆ వికృతాకారాన్ని పొడిచేందుకు ముందుకు వురికేంతలో, "అగు, మందరదేవా! అగు!" అంటూ శివదత్తుడు వెనుకనుంచి కేక వేశాడు. అంతలో సైనికుడి కంఠాన్ని చేతులతో బిగించిన వికృతాకారం వెనక్కు తిరిగి







మందరదేవుడు వంగి ఆ వికృతాకారుడి చేతిని పరీక్షగా చూచి, "శివదత్తా, రాత్రి మనమీదకు రాయి విసరిన ప్రాణి యిదే! ఇదుగో, నాబాణం యిక్కడ యితడి చేతిని తాకింది. మీరన్నట్టు యిది నరవానరం కాదు; నరుడే!" అన్నాడు.

ఇప్పుడు ఆ వికృతాకారుడు, బాధతో మూలుగుతూ, "నేనూ మీలాంటి మానవుణ్ణే! ఈ భయంకర ద్వీపంలో పన్నెండు సంవత్సరాలు ఒంటరి జీవితం గడిపి నేనిలా అయాను!" అన్నాడు.

"నీ పేరేమిటి? పన్నెండు సంవత్సరాలు ఒంటరిగా యీ ద్వీపంలో కాలం గడపవలసిన అవస్థ నీకెందుకు కలిగింది?" అని శివదత్తుడు అడిగాడు.

శివదత్తుడి ప్రశ్నవింటూనే, ఆ వికృతాకారుడు, ఏదో జ్ఞాపకం చేసుకుంటున్న వాడిలా ముఖం చిట్లించి, కొంచెం సేపు మెదలకుండా ఊరుకుని, యిలాచెప్పాడు:

"అయ్యా, నాపేరు వజ్రముష్టి! మాది శమనద్వీపం. నాకు పద్దెనిమిదో ఏడు ప్రవేసించినప్పటినించీ, సముద్రకేతు అనబడే, ఒక క్రూర సముద్రపుదొంగల నాయకుడి కింద పనిచేసేవాణ్ని. సముద్రంమీద ప్రయాణించే వర్తకనౌకలనూ, తీర గ్రామా

పారిపోయేందుకు ప్రయత్నించింది. వెంటనే ముగ్గురు సైనికులు దానిమీద కలియబడి పెనుగులాడి ఎట్టకేలకు దాన్ని అడవితీగలతో కట్టి బంధించారు.

"ఇది నరవానరం కాదు, నూటికి నూరు పాళ్ళు మానవప్రాణి! ఏదో దురదృష్ట సంఘటన యితణ్ణి, ఈ నీచస్థితికి తెచ్చింది," అన్నాడు శివదత్తుడు.

వెంటనే ఒక సైనికుడు ఆశ్చర్యంగా చూచి, "శివదత్తా, చూడండి! ఈ నరవానరం కుడిచేతికి పెద్ద గాయం తగిలి నెత్తురు కారుతున్నట్టు కనబడుతున్నది!" అంటూ అరిచాడు.





లనూ దోచుకోవటం మాపని. కొంతకాలం అలా జీవితం గడిపినతర్వాత, నాకూ, నాయకుడైన సముద్రకేతుకూ వివాదం వచ్చిన కారణంగా, అతడు నన్నీ ద్వీపంలో ఒంటరిగా విడిచిపోయాడు."

"నీది శమనద్వీపమా?" అంటూ శివదత్తుడు, వజ్రముష్టి మాటలకు చాలా ఆశ్చర్యపోయాడు. శమనద్వీపమనగానే, శివదత్తుడికి, శాక్తేయుడి సంగతీ, అతడు వెండి బంగారాలతో చండీదేవికి దేవాలయం కట్టించేందుకు, యితర రాజ్యాల మీద దాడికి బయలుదేరిన సమాచారం గుర్తుకొచ్చింది. శమనద్వీపం ఎక్కడున్నది? ప్రస్తుతం ఆరాజ్యానికి రాజెవరు? ఇలాంటి ప్రశ్నలకు వజ్రముషినుంచి సమాధానాలు రాబట్టవచ్చునని శివదత్తుడికి తోచింది. కాని, అందుకు అది తగిన సమయం కాదనుకున్నాడు. ప్రస్తుతం కావలసింది; తను చేరిన ద్వీపం, అక్కడి స్థితిగతుల సంగతి.

"వజ్రముష్టీ! నువ్వీ ద్వీపంలో పన్నెండు సంవత్సరాలనుంచి వుంటున్నావుగదా? ఇక్కడ నివసించే జనుల గురించీ, వాళ్ల అచారవిశేషాల గురించీ నీకు బాగా తెలుసు ననుకుంటాను!" అన్నాడు శివదత్తుడు.




వజ్రముష్టి నిస్పృహగా తల వూపాడు. "అయ్యా, యిన్ని సంవత్సరాలనుంచీ, నేనిక్కడ వుంటున్నా, నాకు యీ ద్వీపాన్ని గురించి అంతగా తెలిసిందేమీలేదు. అహార సంపాదనకూ, క్రూరమృగాలనుంచి తప్పుకుని బ్రతికేందుకూ చేసే ప్రయత్నంలో నాకాలమంతా వెళ్లబుచ్చాను. ఒకటి రెండుసార్లు మాత్రం, సముద్రకేతుడి ఓడదొంగలు యీ తీరంవెంట వెళ్లటం నాకంట బడింది. అంతకన్న నాకేమీ తెలియదు."

"ఈ ద్వీపంలో యింతవరకూ నీకు మానవమాత్రుడే కనబడలేదా?" అంటూ ఆశ్చర్యంగా ప్రశ్నించాడు శివదత్తుడు.







ఎలాంటి ప్రదేశంలో వున్నామో తెలుసు కోవటం మంచిది. చీకటి పడకముందే, ఆ పని ముగించుకుని, ఎండవానలనుంచి రక్షణకు, ఏవైనా చిన్నకుటీరాలు నిర్మించు కుందాం," అన్నాడు.

శివదత్తుడు సరేనన్నట్టు తల వూపాడు. తరవాత సైనికులకేసి తిరిగి, వజ్రముష్టిని బంధించివున్న అడవితీగలను విప్ప మన్నాడు. కట్లు విప్పగానే, వజ్రముష్టి శివ దత్తుడికీ, మందరదేవుడికీ నమస్కరించి, "అయ్యా, నన్ను కూడా మీ అనుచరవర్గంలో చేర్చుకోండి. విశ్వాసపాత్రుడుగా మీకు సేవ చేయగలను!" అన్నాడు.

వజ్రముష్టి ఏదోగుర్తుకు తెచ్చుకుంటున్న వాడిలా తల వూపి, "ఈ పన్నెండు సంవత్స రాల కాలంలో, సుమారు నాలుగైదు సార్లు మనషులను చూశాను. వాళ్లు అజాను బాహులు; వేటగాళ్లు. తలమీద పెద్దపెద్ద కొమ్ములను ధరిస్తారు. వాళ్ల నివాసం మాత్రం,ఈ దాపులలో కాదు. వేట ముగించు కుని, ఎక్కడికో వెళ్లిపోతారు." అన్నాడు.

శివదత్తుడు, మందరదేవుడికేసి సాభి ప్రాయంగా చూచాడు. మందరదేవుడు నవ్వి, "శివదత్తా! మనం, ప్రస్తుతానికి ఏదో విధంగా ఈ ద్వీపంలో నివసించక తప్పదు గదా? కనుక, యీ చుట్టుపట్ల పరిశోధించి,

శివదత్తుడు తన అనుచరులకేసి చూచాడు. వాళ్ళందరూ అంగీకార సూచ కంగా చేతులు ఎత్తారు. ఇద్దరు ముగ్గురు సైనికులు, వజ్రముష్టిని సమీపించి, స్నేహ సూచకంగా అతడి భుజం తట్టారు.

"ముందు ఆకలి చల్లార్చుకోవాలి. తర వాత, యీ చుట్టుపక్కల పరిస్థితులేమిటో చూడవచ్చు," అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు తల వూపాడు. సైనికులు పోగుచేసుకువచ్చిన ఎండుపుల్లలన్నీ ఒక చోట పేర్చబడి నిప్పు అంటించబడినై. అంతకుపూర్వం చంపబడిన అడవిపందిని



సైనికులు ఎత్తి నిప్పులో పడవేశారు. వజ్రముష్టి కాసేపు ఆ కాల్చబడుతున్న అడవి పందికేసి చూసి, "అయ్యో! ఇది ఒక్కటే మనందరి ఆకలీ తీర్చేందుకు సరిపోదనుకుంటాను. మీరు అనుమతించితే, నాలుగైదు నిమిషాల్లో నేను మరేదైనా జంతువును పట్టుకురాగలను," అన్నాడు.

మందరదేవుడూ, శివదత్తుడూ అనుమతించారు. వజ్రముష్టితోపాటు, ఇద్దరు సైనికులుకూడా విల్లంబులు తీసుకుని బయలుదేరారు. అడవిలో కొంతదూరం వెళ్ళిన తరవాత వారికి ఒకచోట నాలుగైదు లేళ్లు మేస్తూవుండటం కనిపించింది. సైనికులు బాణాలు ఎక్కుపెట్టేంతలో, వజ్రముష్టి వారిని వారించుతూ, "ఈ చిన్న జంతువులను పట్టుకునేందుకు మీరు బాణాలను వృథాపుచ్చవద్దు. మీరిక్కడే వుండండి. నేను పని పూర్తిచేసుకు వస్తాను!" అంటూ చెట్లచాటున మెల్లగా బయలుదేరాడు.

సైనికులుకూడా నిశ్శబ్దంగా వజ్రముష్టి వెనక నడవసాగారు. వజ్రముష్టి అడుగులో అడుగు వేసుకుంటూ కొంతదూరం నడిచి, లేళ్ళు వున్న చోటుకు దాపులనున్న చెట్టును పిల్లిలా ఎగబాకాడు. అతడు ఏమి చేయబోతున్నాడో తెలియని సైనికులు, ఇదంతా




వింతగా చూస్తున్నారు. వజ్రముష్టి లేళ్లకు పైనవున్న చెట్టుకొమ్మల వెంట పాములా పాకిపోయి, హఠాత్తుగా అక్కడినించి వాటిమీదికి దూకేశాడు.

కనుమూసి తెరిచేంతలో లేళ్ళు చెంగున దూకినై. వాటిలో ఒకటి వజ్రముష్టి బలమైన చేతుల్లో తగుల్కొని పారిపోయేందుకు వృథా ప్రయత్నం చేస్తోంది. వజ్రముష్టి తన చేతుల్లో చిక్కిన లేడిని, సునాయాసంగా భుజానవేసుకుంటూ, "ఈ పన్నెండు సంవత్సరాల కాలం, నా ఆహార సంపాదన ఇలాగే జరిగింది. ఈటె, బాణాలు-ఇలాంటివి వాడేందుకు, అవి నా కెక్కడా లభించ



లేదు. ఒకటి రెండుసార్లు పెద్దపులినుంచీ, ఎలుగుబంటినించీ, వట్టిచేతులతో పోరాడి ప్రాణరక్షణ చేసుకున్నాను," అన్నాడు చుట్టూ చేరిన సైనికులతో.

సైనికులు, వజ్రముష్టి దేహబలాన్నీ, ప్రదర్శించిన తెలివితేటలనూ చూచి చాలా ఆశ్చర్యపోయారు. దాదాపు అయిదు అడుగుల ఎత్తూ, పొట్టి కాళ్ళూ, పొట్టి చేతులూ-అతడిలో అంత శక్తి వుంటుందని మొదట్లో వాళ్ళూహించలేదు.

కొద్దిసేపటితరవాత, అందరూ తిరిగి శివదత్తుడున్న చోటు చేరారు. వజ్రముష్టి లేడిని పట్టిన విధం, సైనికులు చెప్పగా విని, శివదత్తుడు చాలా ఆశ్చర్యపడ్డాడు.

మందరదేవుడు కూర్చున్న చోటునుంచి లేచి, వజ్రముష్టిని సమీపించి అతడి భుజం తడుతూ, "వజ్రముష్టీ, నువ్వు మా అనుచరుడుగా లభించటం మా అదృష్టం అనుకుంటున్నాను. నీకు సముద్రకేతుడు చేసిన ద్రోహంలాంటిదే, నాకూ నరవాహనుడనే వాడుచేశాడు. మన ఇద్దరం పగతీర్చుకునేందుకే బ్రతకాలి!" అన్నాడు.

"మందరదేవుడు చెప్పినట్టు, నువ్వు, మాకు అనుచరుడుగా వుండవలసిన వాడివే! ఈ ద్వీపంలో మేము ఎదుర్కొవలసిన ప్రమాదాలేమైనా వుంటే, అందుకు నువ్వు మావెంట వుండి సహాయపడగల వనుకుంటాను. ఏదో ఒక రోజున నిన్ను పన్నెండేళ్లు ఈ భయంకర ద్వీపంలో ప్రవాసిగా చేసిన, ఆ ఓడదొంగ సముద్రకేతుడిమీద నువ్వు పగ సాధించుకోగలవని నా నమ్మకం!" అన్నాడు శివదత్తుడు.

"అయ్యా, నేనూ అలాంటి సుదినం కోసమే ఎదురుచూస్తున్నాను?" అని వజ్రముష్టి అనేంతలో, సముద్రతీరంనుంచి వికృతమైన కేకలూ, అరుపులూ వినిపించినై. అందరూ ఆశ్చర్యచకితులై ఆ ధ్వని వచ్చిన వైపుకు తలలు తిప్పారు. (ఇంకా వుంది)



# సాధించని పగ



పట్టు విడవని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి, శవాన్ని దించి తన భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, భానుదత్తుడు తన పగనైనా విసర్జించాడు గాని, నువుమాత్రం నీ పట్టు విడిచేటట్టు లేవే! అతని కథ వింటే నీ బుద్ధి మారుతుందేమో, ఆకథ చెబుతాను విను!" అంటూ ఈవిధంగా చెప్పాడు:

పూర్వం హిమాలయపర్వతాలకు దిగువను మణిమంతమనే చిన్న రాజ్యం ఉండేది. నందికేతుడనేవాడు ఆ రాజ్యానికి సేనాధిపతి. ఆయన బలపరాక్రమాలవల్లనే శత్రువులు మణిమంతంకేసి తేరిపార చూడలేకపోయేవారు. రాజు కూడా సేనాధిపతి ఎట్లా చెబితే అట్లా నడుచుకునేవాడు.

నందికేతుడికి పుష్పావతి అని ఒక కుమార్తె ఉండేది. ఆమె గొప్ప సౌందర్య

## బేతాళ కథలు

వతి. ఆమెను పెళ్ళాడటానికి అనేకమంది రాజకుమారులు సిద్ధంగా ఉన్నారు. కాని పుష్పావతి భానుదత్తుడనే యువకుణ్ణి ప్రేమించింది. భానుదత్తుడు అందగాడే గాక గొప్ప ఇంటివాడు. అతని తండ్రి ఒక సామంతుడు.

రాజాధిరాజులను పెళ్ళాడవలిసిన తన కుమార్తె ఒక సామంతు కొడుకును ప్రేమిస్తున్నదని తెలియగానే సందికేతుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. వెంటనే ఆయన రాజుపద్దకు వెళ్ళి, "మహారాజా, భానుదత్తుడు దేశద్రోహి. అతనికి వెంటనే దేశ బహిష్కార శిక్ష విధించండి," అన్నాడు. కారణంకూడా అడగకుండా రాజు భానుదత్తుడికి దేశబహిష్కారం విధించాడు.

భానుదత్తుడు ఎంతో పౌరుషమూ, అభిమానమూ కలవాడు. తన కింత అవమానం చేసిన సందికేతుణ్ణి తన కత్తికి బలిచేసి పగ తీర్చుకునే ఉద్దేశంతో ఆ రాత్రి అతను యుక్తిగా సందికేతుడి పడకగది ప్రవేశించాడు. కాని తీరా కత్తి దూసేసమయానికి అతనికి పుష్పావతి జ్ఞాపకం వచ్చింది. సందికేతుణ్ణి చంపటం పుష్పావతికి బాధ కలిగిస్తుందనుకుని, ఆ పని చేయలేక భానుదత్తుడు వచ్చిన దారినే బయటికి బారుకుని, తెల్లవారేలోపుగా రాజ్యం విడిచిపెట్టి,



పక్కరాజ్యమైన పుళిందనగరానికి ఒంటరిగా వెళ్ళిపోయాడు.

పుళిందరాజు దుర్బలుడే గాని ఆయనకు రాజ్యదాహం జాస్తి. మణిమంతంనుంచి వెళ్లగొట్టిన వారందరికీ పుళిందుడు ఆశ్రయం ఇచ్చి, ఎప్పటికైనా ఉపయోగిస్తారని వారికి గొప్పగొప్ప పదవులుకూడా ఇచ్చేవాడు. భానుదత్తుడు తన రాజ్యంలో తలదాచుకోవటానికి వచ్చాడని తెలియగానే పుళిందుడు అతనికి గొప్ప స్వాగతం ఇచ్చి, ఎంతో మర్యాదచేసి, అతను సుఖంగా జీవించటానికి తగిన సౌకర్యాలన్నీ, ఏ లోటూ లేకుండా ఏర్పాటుచేశాడు.

ఒకటి రెండేళ్ళు గడిచాయి. భానుదత్తుడి అభిమానం కొంచెమైనా చావలేదు. పుష్పాపతిపై అతనికుండిన ప్రేమ క్రమంగా తగ్గిపోయిందిగాని, నందికేతుడి ప్రాణం తీయాలనే కాంక్షమటుకు ఎక్కువయింది.

భానుదత్తుడి మనసులో పగ ఎట్లా ప్రజ్వలించేదీ పుళిందుడు కనిపెడుతూనే ఉన్నాడు. ఆయన ఒకరోజు భానుదత్తుడితో, "మిత్రమా, నీ బాధ చూడలేకుండా ఉన్నాను. నీకు కావలిసిన బలాలను నీవెంట పంపుతాను. నీ శత్రువైన నందికేతుణ్ణి చంపుకో. కావలిస్తే మణిమంత రాజ్యాన్నికూడా వశపరచుకో! అక్కడి





రహస్యాలన్నీ ఎరిగినవాడివే గనక కొద్దిపాటి సేనతోనే జయించవచ్చు," అన్నాడు.

నందికేతుడి పేరు వినగానే భానుదత్తుడు పళ్ళు కొరికి, "నాకు రాజ్యం అవసరం లేదు, ఏమీ అవసరంలేదు. నాకు కావలిసిందల్లా ఇద్దరే ఇద్దరు—నందికేతుడూ, అతని కూతురూ!" అన్నాడు.

"నీ యిష్టం! అలాగే కానీ!" అన్నాడు పుళిందుడు. ఆయన భానుదత్తుణ్ణి పంపేసి తన సేనానాయకుణ్ణి పిలిపించాడు. "మంచి యోధానయోధులను అరవైమందిని చూసి భానుదత్తుడివద్దకు పంపించు. వారిలో మణిమంతంనుంచి వచ్చినవారి నందరినీ



చేర్చు. వీరందరినీ తీసుకుని భానుదత్తుడు ముందుగా మణిమంతం వెళ్ళి, నందికేతుణ్ణి చంపేస్తాడు. ఈలోపల నీవు మన సేనలను మణిమంతానికి తీసుకుపో. నందికేతుడు చావగానే అక్కడి బలాలలో అరాజకం ఏర్పడుతుంది. మన యోధులు రాజమందిరాన్ని, సైనికకూటాన్ని వశపరుచుకుంటారు. ఆసమయంలో నీవు మణిమంతంలోకి మన సేనలను ప్రవేశపెట్టు. తెలిసిందా?" అన్నాడు పుళిందుడు. సేనానాయకుడు సరేనన్నాడు.

మర్నాడు అరవైమంది యోధులు భానుదత్తుడివద్దకు వచ్చారు. "అయ్యా, మీ కార్యం నెరవేర్చటానికి సాయపడమని రాజుగారు మమ్మల్ని పంపారు. మీరేం చెయ్యమంటే అది చేస్తాం!" అన్నారు వారు.

భానుదత్తుడు చాలా సంతోషించాడు. నందికేతుణ్ణి చంపే అవకాశం దొరికింది! ఈ మనుషులను ఏవిధంగా ఉపయోగించుకోవాలో అతను ఆలోచించిపెట్టుకున్నాడు. వీరిలో అనేకమంది తనలాగే దేశబహిష్కారం పొందినవాళ్లు. వారికి మణిమంతంలో ప్రతి మూలా తెలుసు.

అవసరమైన ఆయుధాలు తీసుకుని అందరూ బయలుదేరారు. భానుదత్తుడి

వెంట వస్తున్నవారిలో కొందరు, "దైవానుగ్రహంవల్ల మళ్లీ మనమంతా మణిమంతంలో ఉంటాం!" అన్నారు.

"ఎలా?" అన్నాడు భానుదత్తుడు.

"ఈ రాత్రి సందికేతుడు హతుడౌతాడు. రేపు ఉదయానికి పుళిందసేసలు మణిమంతం ప్రవేశిస్తాయి. నీకింకా తెలియదా?" అన్నారు వారు.

భానుదత్తుడు మరింత ఆశ్చర్యపడ్డాడు. తన పగ తీర్చుకోవటానికి పుళిందుడు సాయపడుతున్నాడనే అతను అనుకున్నాడు. మణిమంతాన్ని సులువుగా జయించటానికి ఆ దుర్మార్గుడు తనను ఎరగా ఉపయోగిస్తున్నట్టు కలలోకూడా ఊహించలేదు.

అర్ధరాత్రి సమయానికి భానుదత్తుడూ, అతని అనుచరులూ మణిమంతం కోట గోడలవద్దకు చేరుకున్నారు. మిగిలినవారందరినీ దూరంగా గోడనీడలో నిలబెట్టి, భానుదత్తుడు తలుపు తట్టాడు.

"ఎవరు వారు?" అని తలుపు అవతల నుంచి వినిపించింది.

"నేను భానుదత్తుణ్ణి! తలుపు తెరవండి," అన్నాడు భానుదత్తుడు.

వెంటనే చిన్న తలుపు తెరుచుకున్నది. ద్వారరక్షకుడు బయటికి వచ్చి, "మీరా,




స్వామీ? ఒంటరిగా ఎందుకొచ్చారు? ప్రమాదం కాదా?" అన్నాడు.

"పని ఉండి వచ్చాను. తెల్లవారేలోగా తిరిగిపోతాను," అన్నాడు భానుదత్తుడు.

"దయచెయ్యండి!" అంటూ ద్వారరక్షకుడు భానుదత్తుణ్ణి లోపలికి రానిచ్చి చిన్న తలుపు మూశాడు. వెంటనే భానుదత్తుడు ద్వారరక్షకుడిపై పడి, నోరునొక్కేశాడు. తరవాత వాడినోట గుడ్డలు కుక్కి, చేతులూ, కాళ్ళూ కట్టేసి, దూరంగా పొదలలో తీసుకుపోయి పడేశాడు. ఆ తరవాత అతను తలుపు తెరిచి తనవెంట వచ్చినవారందరినీ లోపలికి రానిచ్చాడు.

అందరినీ తీసుకుపోయి ఒక ఆలయం ఆవరణలో దాచి, "నేను పని ముగించుకు వచ్చేదాకా ఇక్కడే ఉండండి. రెండు ఘడియల్లో తిరిగివస్తాను!" అని వాళ్లను హెచ్చరించి భానుదత్తుడు కదిలాడు.

అతను నేరుగా నందికేతుడి ఇంటికి వెళ్లి, నందికేతుడి పడకగదిలో ప్రవేశించాడు. నందికేతుడు గాఢనిద్రలో ఉన్నాడు. "శత్రువులు వచ్చారు, లే, లే!" అని అతను సేనాధిపతిని తట్టి లేపాడు.

నందికేతుడు తుళ్ళిపడి లేచాడు. ఎదురుగా భానుదత్తుడు కనిపించేసరికి ఆయన గుండె దడదడలాడింది. నోట మాటలేదు.

"వీరాధివీరుడవు! ఆపద వచ్చిపడుతుంటే అలా గుడ్లుపెట్టుకు చూస్తావేం?" అన్నాడు భానుదత్తుడు.

"నన్ను కత్తి తీసుకోనీ! నిరాయుధుణ్ణి చంపకు," అన్నాడు నందికేతుడు.

భానుదత్తుడు నవ్వి, "నేను నీవంటి నీచుణ్ణికాను. నీకు భయం నానుంచి కాదు. ఆలయంలో అరవైమంది ఆయుధపాణులున్నారు. వారు ఆలయం దాటి రాకుండా ఒక వందమంది సైనికులను ఆలయం గోడలపైకి ఎక్కించు. అన్నివైపులనుంచీ బాణాలు ఎక్కుపెట్టినాక తమ ఆయుధాలను వాళ్ళే అవతల పారేస్తారు...తెల్ల



వారేలోపుగా పుళింద సైన్యాలు ద్వారాల వద్దకు చేరుతాయి. కోట గోడలమీద మన సైన్యం సిద్ధంగా ఉంచు. ఈమాట చెప్పటానికే నేను వచ్చాను," అన్నాడు.

నందికేతుడికి ఎక్కడలేని శక్తి వచ్చింది. ఆయన భానుదత్తుడి వెంట వందమంది విలుకాళ్లను ఆలయంవద్దకు పంపాడు. అందరూ ఆలయం గోడలెక్కి బాణాలు సంధించి సిద్ధంగా ఉన్నమీదట, భాను దత్తుడు లోపలివాళ్లను ఇవతలికి రమ్మని కేకవేశాడు. వారు ఆలయంలోనుంచి బయటికి రాగానే చుట్టూ గోడలమీద విలుకాళ్లు కనిపించి, "ఆయుధాలు అవతల పారెయ్యండి" అని అరిచారు. భానుదత్తుడి అనుచరులు కంగారుపడి తమ కత్తులూ కటార్లూ దూరంగా పారేశారు. వెంటనే గోడలమీది సైనికులు లోపలికి దూకి అందరినీ పెడరెక్కలు విరిచికట్టేశారు.

భానుదత్తుడు అక్కడినుండి బయలుదేరి, నందికేతుడితోనూ, సేనలతోనూ దక్షిణ ద్వారాలు చేరాడు. అక్కడ పొదల్లో పడి ఉన్న ద్వారరక్షకుణ్ణి విడిపించాడు. తరవాత సైనికులు గోడలెక్కారు.

తెల్లవారుజామున అనుకున్నప్రకారం పుళిందసేనలు వచ్చాయి. కాని వారికోసం ద్వారాలు తెరుచుకోవటానికి మారుగా



బాణాలవర్షం వారిని ఆహ్వానించింది. చూస్తుండగానే పుళిందసైనికులు అనేక మంది చచ్చిపోయారు. మిగిలినవారు చెల్లా చెదరై వచ్చినదారి పట్టారు. నందికేతుడు తన సైనికులతో వారిని చాలాదూరం తరిమి చాపగొట్టి, సాగనంపి వచ్చాడు.

ఇదంతా ముగిసిన కాస్సేపటికి నంది కేతుడూ, భానుదత్తుడూ రాజసభకు వెళ్ళారు. నందికేతుడు సభలో జరిగిన దంతా చెప్పి, "మహారాజా, భానుదత్తుడికి లోగడ దేశబహిష్కారం విధించి ఉన్నాం. ఆ శిక్ష రద్దుచేసి అతనికి ఉపసేనాధిపతి పదవి ఇవ్వవలిసిందని నా ప్రార్థన," అన్నాడు. భానుదత్తుడు ఉపసేనాధిపతి కావటమే గాక, సేనాధిపతి అల్లుడుకూడా అయి సుఖంగా ఉన్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, ఒక సారి ప్రేమకోసం తన పగను విసర్జించిన భానుదత్తుడు, రెండవసారి మళ్ళీ పగతీర్చు కోవటానికి ఎందుకు పూనుకున్నాడు? తీరా అవకాశం దొరికేసరికి పగతీర్చుకునే ప్రయ త్నాన్ని ఎందుకు మానుకున్నాడు? సమా ధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"ప్రేమకన్న పగ బలీయమైనది. అందు చేతనే ప్రేమ చల్లారినాకూడా భానుదత్తుడి హృదయంలో పగ చల్లారలేదు. అందు చేతనే అతను పుళిందుడి సహాయంతో నందికేతుడిమీద పగ తీర్చుకోవటానికి బయలుదేరాడు. కాని పగకంటె బలీయ మైనది దేశభక్తి. తాను నందికేతుడిపై పగ తీర్చుకున్నట్టయితే దేశం శత్రువుపాలవు తుందని తెలియగానే భానుదత్తుడు తన పగను విసర్జించేశాడు," అని విక్రమార్కుడు జవాబు చెప్పాడు.

ఈవిధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)



జాలివేసింది. ఆయన ఆ కుర్రవాణ్ణి ఒక కాలిబాటమీద పెట్టి వచ్చేశాడు. తరవాత రాజూ, మంత్రీ కోటకు వెళ్ళిపోయారు.

వారు వెళ్లిపోయే సమయానికే ఆ సమీపాన ఉండే పెద్ద దేవాలయానికి చెందిన అర్చకుడూ, పూజారులూ ఆ కాలిబాట వెంబడి నదీస్నానానికి వచ్చారు. వారికి దారిలో గుడ్డల మూటలాగా కనిపించింది. ఎత్తి చూస్తే పిల్లవాడు. అర్చకుడు వెంటనే కుర్రవాణ్ణి తీసుకుని ఇంటికి తిరిగివెళ్లాడు. వాడి పొట్టలో కత్తిపోటున్నది, కాని వాడు జీవించే ఉన్నాడు. అర్చకుడు మూలికా వైద్యంలో గట్టివాడు. ఆయన వెంటనే ఏవో ఆకులు తెచ్చి, పసరు పిండి, గాయానికి కట్టుకట్టాడు.

కొద్దిరోజులకల్లా కుర్రవాడి గాయం నయమయింది. పిల్లలు లేని అర్చకుడు ఆ కుర్రవాణ్ణి పెంచుకుని, వాడికి దేవదత్తుడని పేరు పెట్టుకున్నాడు.

ఆ యేడు గడవకముందే రాజుగారి భార్య గర్భిణిగా ఉండి సకాలంలో ఒక ఆడపిల్లను ప్రసవించింది. ఆ పిల్లకు చంద్రావతి అని పేరు పెట్టుకున్నారు. ఆనాడు తాను ఆ బ్రాహ్మడి కొడుకుని చంపకపోతే వాడు ఈ పిల్లకు భర్త అయి



ఉండేవాడు కాబోలునని రాజు అనుకుని, తాను చేసిన పనికి చాలా సంతోషించాడు.

కాని రాజు చనిపోయినట్టు భావించిన కుర్రవాడు అర్చకుడి ఇంట పెరుగుతూ, ఆలయం ప్రాంగణంలో ఆడుకుంటూ, దినదిన ప్రవర్ధమానుడై పెరగసాగాడు.

పదిహేనేళ్లు గడిచాయి. ఆలయంకింద ఉన్న మాన్యాల విషయంలో రాజుగారి దగ్గిర ఫిర్యాదు చేయటానికై అర్చకుడు ఒకనాడు కోటకు బయలుదేరాడు.

దేవదత్తుడు కూడా కోటచూస్తానని అర్చకుడి వెంట బయలుదేరాడు. వీళ్ళిద్దరూ రాజప్రాసాదానికి వెళ్ళేసరికి రాజుగారు

ఉద్యానవనంలో విహారంచేస్తున్నాడు. అర్చకుడు దేవదత్తుణ్ణి ఒక శిలావేదిక మీద కూచోమని చెప్పి తాను వెళ్ళి రాజుగారిని కలుసుకుని, మాన్యాలకు సంబంధించిన విషయాలు మాట్లాడాడు. రాజుగారు అక్రమాలను సరిచేయిస్తానని మాట ఇచ్చాడు. తరవాత ఇద్దరూ కలిసి దేవదత్తుడు కూచుని ఉన్న చోటికి వచ్చారు. వారిని చూసి దేవదత్తుడు లేచి నిలబడ్డాడు.

"ఎవరీ కుర్రవాడు? చాలా అందంగా ఉన్నాడే?" అన్నాడు రాజు.

"చిత్తం, ప్రభూ! వీడు నా కొడుకే. నా పెంపుడు కొడుకు!" అన్నాడు అర్చకుడు.

రాజు అర్చకుడి నోట ఆ పిల్లవాడి వృత్తాంతమంతా విని కలవరపడ్డాడు. వీడే ఆనాడు తాను చంపాలనుకున్న కుర్రవాడు. వాడి పొట్టమీద ఇప్పటికీ కత్తిపోటు మచ్చ ఉన్నది! వాడు బతికి బట్టకట్టటం తనకూ, తన కుమార్తెకూ మంచిది కాదని రాజు నిశ్చయించుకున్నాడు. ఆయన అర్చకుడితో, "వీణ్ణి ఆ ఆలయంలో ఉంచి ఎందుకు పాడుచేస్తావు. కోటలో ఉంచు, లోకజ్ఞానం సంపాదించి పైకి వస్తాడు!" అన్నాడు.

"తమ అనుగ్రహం! తప్పక వాణ్ణి తమవద్దనే ఉంచండి," అన్నాడు అర్చకుడు. తరవాత ఆయన రాజువద్ద సెలవు



పుచ్చుకుని ఒంటరిగా తన నివాసానికి తిరిగి వెళ్ళిపోయాడు.

గర్భశత్రువులాటి ఈ దేవదత్తుణ్ణి ఎట్లా తుదముట్టించాలో రాజుకు తెలియలేదు. అదివరకు ఒకసారి చేసిన ప్రయత్నం మంత్రికి మాత్రమే తెలుసు. అది విఫల మయింది. ఇప్పుడు మళ్ళీ వీడు తన చేతికి చిక్కాడు. ఎవరికీ తెలియకుండా, ఎవరూ తనను అనుమానించకుండా వీణ్ణి వెంటనే చంపెయ్యాలి. ఈ సమస్య రాజును వేధించ సాగింది.

సరిగా ఈసమయానికి రాజు దూర ప్రయాణంమీద బయలుదేరవలిసి వచ్చింది. ఆ ప్రయాణంలో రాజు దేవ దత్తుణ్ణి వెంటబెట్టుకు వెళ్ళాడు. ఇది పదిహేను రోజుల ప్రయాణం. దారిలో దేవదత్తుణ్ణి ఏ కొండమీదినుంచి తోసివేద్దా మన్నా, ఏ నదిలో పారేద్దామన్నా, పక్కన ఎవరో ఒకరు ఉంటూనే వచ్చారు.

చివరకు రాజు ఒక ఉపాయం ఆలో చించాడు. ఆయన తన మంత్రికి ఒక లేఖ రాశాడు. అందులో, "ఈ జాబు తెచ్చేవాడు మనకు పరమ శత్రువు. వీణ్ణి ఏవిధంగా నైనా రహస్యంగా చంపి, ఎవరికీ తెలియ కుండా శవాన్ని దహనం చేయించవలి సింది," అని రాసి, ఉత్తరంమీద తన





ముద్ర వేసి సీలుచేసి, ఆ ఉత్తరాన్ని దేవదత్తుడి కిచ్చి, "నాయనా, నువు మన రాజధానికి వెంటనే బయలుదేరి పోయి, ఈ ఉత్తరాన్ని మంత్రికి అందించు. ఇది చాలా ముఖ్య విషయం," అని చెప్పాడు.

దేవదత్తుడు ఆ ఉత్తరం తీసుకుని గుర్రంమీద బయలుదేరి పదిహేను పగళ్లూ, పదిహేను రాత్రులూ ప్రయాణంచేసి, పదహారో రోజు మధ్యాన్నానికి రాచనగరు చేరాడు. ఎండ మండిపోతున్నది. మంత్రిగారు భోజనంచేసి విశ్రాంతి తీసుకునే సమయం. కాస్త పొద్దువాలినాక మంత్రిగారిని చూద్దామని, దేవదత్తుడు ఉద్యానవనంలో ప్రవేశించి ఒక పొదరింటి నీడలో చేరి పడుకుని నిద్రపోయాడు.

మరికొంతసేపటికి రాజకుమార్తె చంద్రావతీ, ఇద్దరు చెలికత్తెలూ ఆ తోటలోకి వచ్చి ఆటలాడుతూ, ఒకరినొకరు తరిమి అందుకోసాగారు. చంద్రావతి తన చెలికత్తెలకు అందకుండా చెట్లమధ్యగా పరిగెత్తుతూ దాక్కోవటానికి పొదరింట ప్రవేశించి, అక్కడ నిద్రపోతున్న దేవదత్తుణ్ణి చూసి ఆశ్చర్యపడింది. అతను చాలా అందంగా ఉన్నాడు, కాని ఎవరో కొత్తవాడు. లేపి అడుగుదామనుకుంటే, అలిసిపోయి గాఢ నిద్రలో ఉన్నట్టు కనిపించాడు. అతని జేబులో ఉన్న ఉత్తరం కనిపించింది. చంద్రావతి ఆ ఉత్తరం తీసి దానిమీది సీలు చూసి, తన తండ్రిదేనని తెలుసుకుని, స్వతంత్రంగా ఉత్తరం చించి లోపల ఉన్న విషయాలు చదివింది.

వెంటనే రాజకుమార్తె గుండె అగినట్టయింది. ఈ అందమైన యువకుణ్ణి చంపమని తన తండ్రి మంత్రికి ఎందుకు రాయాలి? ఇలా ఉత్తరంలో రాసిఉన్నట్టు తెలిస్తే ఈ కుర్రవాడు ఈ ఉత్తరాన్ని ఇంత దూరం పట్టుకువస్తాడా? అతడిపై చంద్రావతికి ప్రేమా, జాలీ కలిగాయి.

ఈలోపల రాజకుమార్తె కనిపించక చెలికత్తెలు ఆమెను పిలుస్తున్నారు. చంద్రావతి పొదరింటినుంచి బయటికి వచ్చి, చెలికత్తెలను కలుసుకుని, అందులో ఒకతెను తోట ద్వారంవద్ద కాపుపెట్టి, రెండవ దానిచేత ఘోరమైన ప్రమాణాలన్నీ చేయించినమీదట రహస్యంగా ఉత్తరం చూపింది. ఇద్దరూ చాలాసేపు వితర్కించుకుని ఆ ఉత్తరం చించి పారెయ్యాలనీ, దానికి బదులు ఇంకేదైనా ఉత్తరం ఉంచాలనీ నిశ్చయించారు.



తరవాత చంద్రావతి తన గదికి వెళ్ళి ఇంకొక ఉత్తరం రాసింది. "ఈ జాబు తెచ్చేవాడు మనకు పరమ ఆప్తుడు. ఇతనికి నా కుమార్తెను, చిరంజీవి సౌభాగ్యవతి చంద్రావతి నిచ్చి వివాహం చేయించవలిసింది. నాకోసం వివాహం ఆగ నవసరం లేదు." ఈ ఉత్తరం రాసి, దానిపైన ముద్రిక వేసి, సీలువేసి, దానిని వెంటనే తెచ్చి పొదరింటో ఇంకా నిద్రపోతున్న దేవదత్తుడి జేబులో పెట్టింది.

తరవాత చంద్రావతీ, చెలికత్తెలూ గట్టిగా నవ్వి, కేకలుపెట్టి, గోలచేసి ఎలాగో దేవదత్తుడికి నిద్రాభంగం కలిగించారు. అతను కంగారుతో లేచి, పొద్దు వాలిపోతూండటం గమనించి, మంత్రివద్దకు వెళ్ళి తన జేబులో ఉన్న ఉత్తరం ఇచ్చాడు.

మంత్రి ఉత్తరం చదువుకుని నిర్ఘాంతపోయి, "ఏమోయ్, రాజుగారు నీతో ఏమన్నారు?" అని అడిగాడు.

"ఈ ఉత్తరం తమకిమ్మన్నారు," అన్నాడు దేవదత్తుడు.

"ఇందులో ఏమున్నదో నీకు తెలుసా?" అని అడిగాడు మంత్రి. తెలియదన్నాడు దేవదత్తుడు.

"సరే, నువు వెళ్ళి దివాణంలో బస చెయ్యి. మళ్ళీ నీకోసం పిలిపిస్తాను," అని మంత్రి రాజకుమార్తెవద్దకు వెళ్ళి, ఆమెకు

ఆమె తయారుచేసిన దొంగ ఉత్తరమే తిరిగీ చూపించాడు.

చంద్రావతి అమాయికంగా, "ఇదేమిటి? నాన్నగారు దగ్గిర లేకుండా ఎవరినో పెళ్ళాడనా? అదెలా వీలవుతుంది?" అన్నది.

"అమ్మా! నేనుమాత్రం ఏం చెయ్యను? మహారాజుగారి ఆజ్ఞ! దాన్ని మీరేటందుకు నాకు అధికారం లేదు," అన్నాడు మంత్రి.

"అయితే మీ యిష్టంవచ్చినట్టు చెయ్యండి! నన్నడగటం దేనికీ?" అన్నది చంద్రావతి.

మంత్రి వెంటనే పెద్దఎత్తున పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించి రెండు మూడు రోజులకల్లా అతివైభవంగా చంద్రావతికీ, దేవదత్తుడికీ పెళ్లిచేసేశాడు. ఈ పెళ్లిలో సంభావనలు పుచ్చుకోవటానికి ఎంతెంత దూరంనుంచో బ్రాహ్మలు వచ్చారు.

ఈలోపుగా రాజు తిరుగుప్రయాణమై రాసాగాడు. పెళ్ళినుంచి తిరిగిపోయే బ్రాహ్మలు ఆయనకు ఎదురుపడి పెళ్లిని గురించి ఘనంగా చెప్పారు. రాజుకు ఆశ్చర్యంవేసింది. తాను లేనప్పుడు తన కుమార్తె వివాహం ఎవరు చేశారు? ఎందుకు చేశారు? ఈ విధంగా ఆశ్చర్యపడుతూ రాజు తన నగరు చేరి జరిగినదంతా తెలుసుకున్నాడు.

"నేను రాసిన ఉత్తరం ఏదీ?" అని అడిగాడు రాజు.

మంత్రి ఉత్తరం తెచ్చి చూపాడు. అది తన కుమార్తె చేసిన పనే అని రాజుకు వెంటనే తెలిసిపోయింది. కాని పైకి ఏమీ అనలేదు.

"మహాప్రభూ, తమరు స్వయంగా దగ్గిర ఉండి చెయ్యవలిసిన ఈ వివాహం నాచేత ఎందుకు చేయించారు?" అని అడిగాడు మంత్రి.

"పిచ్చివాడా! అంతా గ్రహబలం!" అన్నాడు రాజు.





# మిత్రభేదం

ఘనవటచ్ఛాయలో - గ్రాలు సింహమ్ము
తనవంక వచ్చెడు - దమనకు జూచి
రానిమ్మటంచు ద్వా-రస్థుతో ననగ
తా నరుదెంచి రా-జానతి నంది
దండమ్ము వెట్టి చెం-తను గూరుచుండె
దండితసమ్మున - దమనకుం డంత.

పింగళకుడు :

ఏమోయి కుశలమా ? - ఏమిటి వార్త !
ఈమధ్య కనపడ-నేలేదు నీవు !

దమనకుడు :

పనియేమి మాతోడ - వనపతి కంచు
మునుకొని దర్శన - మ్మొనరించుకొనము
అగుగాని మావంటి - అల్పులుగూడ
తగరు పోనాడంగ - ధరణీశులకును.
పనికిరానట్టి ఏ-జనుడుండు భువిని
అనఘుడా దాసుల - మగుదుము మీకు.
తరతరమ్ముల మేము - తమ సేవకులము
దొర చిత్తమని మిమ్ము - దరియుటలేదు.
ఆఁ ! నక్కయేగదా - అని చిన్నచూపు
మాను మహారాజ ! - మఱి పెద్దలనరె ;
పురుగులలో పుట్టు - పట్టు పుట్టమ్ము ;
కరకు రాలను పుట్టు-గద అపరంజి.
బురదలోనేకదా - పుట్టు పద్మమ్ము ;
మఱి చందమామ జ-న్మము సంద్రమందు.
ఇంత పీడను పుట్టు - ఇందీవరమ్ము
అంత కఱ్ఱను పుట్టు - అగ్ని రాజేంద్ర !
పడగలో మణి పుట్టు, - పశువుపిత్తమున
గుడగుడలాడును - గోరోజనమ్ము.
తమ గుణమ్ములనె ఉ-త్తములు వెల్గుదురు
శ్రమజెందనేల జ-న్మముగూర్చి మనము.
ఇంటిలో పుట్టిన - ఎలుక జంపుదుము,
ఒంటి పిల్లిని దెచ్చి - ఊరింతు మెపుడు.
అసమర్థుడైనట్టి - అశ్రితుడేల ?
పసగల్గువాడైన - పగవాడు నేల ?
భక్తియు శక్తియు - ప్రబలియున్నట్టి
రక్తుని నన్ను తి-రస్కరించకుడు.

విద్వాన్ విశ్వం




పింగళకుడు :

అది నిజమేగాని - అసమర్థుడైన
పదనైనవాడైన - పందయే అయిన
మామంత్రి కొడుకువు, - మఱి మాటలేల
ఏమికావలసిన - నిక చెప్పవోయి.

దమనకుడు :

విన్నపమొక్కటి - వినిపింపవలయు
మన్నింపవలె నాదు - మాటనోరాజ!
ఏకాంత మిప్పింప - నే వేడుచుంటి,
మీ కాలిబంటును - మేలుగోరుదును
అను మాట విని రాజు - అంతర్యమెఱిగి
చనిరి జంతుజనాలు - సొంతమ్ముగాను.
అపుడు దొరం జూచి - ఆ దమనకుడు
కపురంపు పలుకుల - గడగడ ననెను-

దమనకుడు :

యమునానదిని దప్పి - అడగింప వచ్చి
తమరిట్లు వెనుకకు - తప్పిరానేల ?

పింగళకుడు :

ఏమున్నదోయి నీ-విట్లడుగంగ
మేము ఊరక నిట - మెసలుచున్నాము.

దమనకుడు :

చిత్తము మీరిది - చెప్పరానట్టి
సత్తమైనను చెప్ప-జాలరు లెండు.
కలదు భార్యతోడ - పలుకరానిదియు
కలదు సొంతమువారి - కెలన దాచుటయు
మంచిది నేస్తులు - మన పుత్రులైన
కొంచెమేదో చెప్ప - గూడనిదుండు.
ఎది చెప్పగావలె - ఎది కూడదనుచు
మది తలపోసియే - మాట్లాడవలయు
బలవంతపెట్టను - పలుకరానట్టి
బలమైన హేతువు - కలదుకావచ్చు.
ఈ మాటలను జూడ - నేదొ యొకింత
ధీమంతుడితడని - తెగువతో రాజు
దమనకుతో నిట్లు - తడబడుకొనుచు
తమ కథనెల్ల సిం-హము చెప్పనైచె.

పింగళకుడు :

కొండల గదలించు - గొప్పగర్జనము
నిండినదిట మున్ను - నీవు విన్నావ ?

దమనకుడు :

విన్నాను లెండు అ - వెఱ్ఱిగర్జనము
విన్నమాత్రన ఏమి - విపరీతమద్ది ?

పింగళకుడు :

అది విన్నతర్వాత - అనుకొనుచుంటి
కదలెద నిచ్చటి - కానను వీడి.
చేరినదెదియొ ఈ - చేరువలోన
ఘోరమృగమ్ము గ-ర్జారవమ్ములనె
తెలియుచునుండెనా - బలమైన మృగము
తెలియుచునుండెనా - బలసత్త్వములును
ఇక మన మిచ్చట - నెట్లుండగలము ?
చకచక పోవుటే - సర్వసమ్మతము.

దమనకుడు :

అంత తొందర ఏల-నయ్యా ఓరాజ
సుంత శబ్దమునకే - సొగయగానేల ?
వినలేద పిఱికివా-డును దబాయింపు
కొనసాగజేసి ము-క్కును సాపునను చు
అంకెలకేమిలే ? - రవరవకేమి ?
మంకుపట్టును కాదు - మనవిచేసెదను
తరతరమ్ములనుండి - దొరవారి వనము
ఉరుకనేటికి దీని - దరిదాపు విడిచి.
మోతలకేమి ఎ-న్నో తరహాలు
కాతరపడనేల - కైమోడ్తు వినుడు
గడగడలాడించు - ముడిశత్రు జూచి




దడదడలాడని - ధైర్యమ్ము వలయు
ఆపదలందున - అడలిపోరాదు-
ఏపట్ల ధనమున - ఎక్కిపోరాదు.
రణరంగమందున - వణకిపోరాదు.
గుణవంతులన్నచో - గొప్పలియ్యవియె.
ఎదిరి దర్పము జూచి - పదునెక్కకున్న
బదుకేల లక్క ఆ-భరణాలబోలె
ఎదుట అగ్గిని చూచి - ఇట్టె కరంగు
అదికాదు మరియింత - కుదురుకోవలయు.
కథ చెప్పినట్లుండె-గద మహారాజ

పింగళకుడు :

కథ ఏమిటోయి ని-క్కము చెప్పుమింక ?

# నావికుడు సిందబాద్

నా తండ్రి గొప్ప వర్తకుడు. పాత్రులైన పేదలకు ఆయన దానధర్మాలు చేసేవాడు. చనిపోయేనాటికి ఆయనకు అంతులేని ధనమూ, భూములూ, గ్రామాలూ ఉండేవి. నాకు యుక్తవయసు రాగానే ఈ సంపదకు నేనే యజమాని నయాను. నేను నా వయసువారిని కొందరిని చేరదీసి తిండీ, తాగుడూ, దుస్తులూ మొదలైన వాటికింద విచక్షణలేకుండా చిత్తం వచ్చినట్టు ఖర్చుచేసి, మహారాజవైభవం వెలగబెట్టాను. నాకు గల ఆస్తి ఎన్నటికీ తరగదని నా భ్రమ. ఒకానొకనాటికి నాకళ్ళు విచ్చుకున్నాయి; ఎందుకంటే, నాకుండిన దంతా దాదాపు అయిపోయింది! వార్ధక్యంలో దారిద్ర్యంవాత పడవలిసి వస్తుందికాబోలునని నేను భయపడ్డాను. "చచ్చిన సింహంకంటె బతికున్న కుక్క నయం; దారిద్ర్యంకంటె మరణం నయం," అని నాతండ్రి ఎప్పుడూ అంటూండేవాడు. ఆ మాటలు నాకు జ్ఞాపకం వచ్చాయి.

అందుచేత నాకింకా మిగిలి ఉన్నదంతా తెగనమ్మి మూడువేల వెండి దిరహములు నగదు సమకూర్చుకున్నాను. ఈ డబ్బుతో సంచారం చెయ్యాలని

## మొదటి సముద్రయానం

CHITRA

నాఉద్దేశం. ఎంతలోతుకు పోతే అంత మంచి ముత్యాలు దొరుకుతాయి అనే సామెత ఉన్నదిగదా. ఈ డబ్బుతో రక రకాల సరుకులు కొని, బాగ్దాదునుంచి బయలుదేరే ఒక వర్తకనౌకలో నేనుకూడా ఎక్కాను. ఆ నౌకలో నాతోపాటు ఇంకా అనేకమంది వర్తకులున్నారు. నౌక నది వాలున బస్రాకు పోతున్నది.

బస్రానుంచి మేము సముద్రయానం సాగించాం. దారిలో ఎన్నో దీవులు తగి లాయి, ఎన్నో రేవులు తగిలాయి. ప్రతి చోటా సరుకు అమ్మాం, ఇతర సరుకులతో మారకం వేసుకున్నాం.

అనేక వారాలపాటు మాకు భూమి పొడ కనిపించకుండా ప్రయాణం చేశాక ఒక అందమైన దీవి కళ్లబడింది. అది పచ్చగా మరకతంలాగా కంటిని ఆకర్షించింది. సరంగు పడవను ఆ దీవివద్దకు చేర్చి లంగరు దింపించాడు. తాళ్లనిచ్చెనలమీద ప్రయాణీకులం నేలమీదికి దిగాం.

మా వర్తకులందరివద్దా ఆహారమూ, వంటపాత్రలూ ఉన్నాయి. కొందరు నిప్పు చేసి వంట ప్రారంభించారు. కొందరు తమ బట్టలు ఉతుక్కున్నారు. కొందరు పచార్లు చేశారు, మరికొందరు విశ్రాంతి తీసు కున్నారు. నేనుమటుకు ఆహారం ఏర్పాట్లు






చేసుకోవటమే గాక, అక్కడి వింతవృక్షాల మధ్యగా నడిచి ఆనందించాను.

ఈ విధంగా మేమందరమూ ఎవరి పనులలో వారు నిమగ్నులమై ఉన్న తరుణంలో ఉన్నట్టుండి ఆ దీవి, ఈ చివరనుంచి ఆ చివరకు, ఒక్కసారిగా కంపించింది. ఎక్కడివాళ్ళ మక్కడ నేలమీద కూలిపోయాం. మేము దిగ్భ్రాంతులమై పడిపోయిఉన్న సమయంలో సరంగు పడవలో నుంచి కనిపించి, వెర్రిగా చేతు లూపుతూ భయంతో గూడిన కంఠంతో, "అపాయం! ప్రాణాలు రక్షించుకోండి! అది దీవి కాదు, బ్రహ్మాండమైన తిమింగలం! అది అనాదిగా సముద్రంలో ఉండటంచేత దాని వీపున ఇసుక పేరి అందులో చెట్లు మొలిచాయి! మీరు మంటలుచేసి దాన్ని రెచ్చగొట్టారు. అది కదులుతున్నది. వచ్చెయ్యండి! లేకపోతే అది నీటిలో మునిగి మిమ్మల్నికూడా ముంచెయ్యగలదు!" అని అరిచాడు.

ఈ మాటలు విన్న వర్తకులు తమ బట్టలనూ, గిన్నెలనూ, ఇతర సామగ్రినీ వదిలేసి పడవవేపు పరిగెత్తారు. పడవ లంగరు ఎత్తుతున్నారు. అది కదిలింది. కొందరు పడవను అందుకోగలిగారు, మరికొందరు అందుకోలేక పోయారు. ఇంతలో తిమింగలం నీటిలో మునగనే మునిగింది. పడవ అందుకోలేక దాని వీపుమీద దిగబడిపోయిన వారంతా సముద్రంపాత పడ్డారు.

సముద్రంపాత పడినవారిలో నేనుకూడా ఒకణ్ణి. కాని అల్లా అనుగ్రహంచేత ఒక కొయ్యతొట్టి నావేపు కొట్టుకు వచ్చింది. అందులో ఎవరో వర్తకులు బట్టలు ఝాడించుకున్నారు. ఆ తొట్టి నన్ను సముద్రంలో మునగకుండా కాపాడింది. ప్రాణంమీది తీపికొద్దీ నేను దాన్ని పట్టుకుని అసాధారణమైన యత్నంచేసి దానిమీదికి ఎక్కి కూచున్నాను. కూచోటానికి పట్టు కుదిరాక నేను నా కాళ్లను తెడ్లలాగా

ఉపయోగిస్తూ ముందుకు పోగలిగాను. కాని అలలు తొట్టిని ఈ పక్కకూ, ఆ పక్కకూ వంచుతూనే ఉన్నాయి.

ఈలోపల పడవ తెరచాపలన్నీ ఎత్తారు. అది వాయువేగాన వెళ్లిపోతున్నది. నేను నా శక్తికొద్దీ కాళ్లతో నీటిని తోస్తూ దాని వేపు వెళ్ళాను. కాని అది కొద్దిసేపటిలో చూపుమేరలో లేకుండా వెళ్లిపోయింది. ఇంతలో చీకటికూడా పడింది. నేను చచ్చానే అనుకున్నాను. ఆ రాత్రల్లా, మర్నాడల్లా సముద్రుడితో ఘర్షణ పడగా చివరకు గాలీ, అలలూ కలిసి నన్ను ఒక దీవి తీరానికి తెచ్చి పడేశాయి. ఆ తీరం వెంబడి కొండలు నిటారుగా లేచిఉన్నాయి. అయితే కొండపై నుంచి కిందికి ఏవో లతలు దిగి సముద్రం లోకికూడా పాకుతున్నాయి. నా చేతుల లోనూ, కాళ్ళలోనూ ఉన్న బలాన్నంతా వినియోగించి, అమానుషమైన ప్రయత్నంతో ఆ లతలను పట్టుకుని క్రమంగా పైనున్న ప్రదేశానికి ఎగబాకాను.

ఇప్పటికి ఒక ఒడ్డు చేరాను గనక నా స్థితి ఎలా ఉన్నదీ తెలుసుకోగలిగాను. నా వంటినిండా గాయాలూ, కదుములూనూ. సముద్రంలో చేపలు నాపాదాలను పూర్తిగా కొరికేశాయి. అపాయంమూలానా, డస్సి



పోయిఉండటంవల్లా, నాకీబాధ లేవీ ఇంత వరకు స్ఫురించలేదు. కాని ఇప్పుడు బాధతో పడిపోయాను. స్పృహ లేకుండాపోయింది!

ఆ రోజల్లా నా ఒళ్ళు నాకు తెలీదు. మర్నాడు ఎండ నా ముఖంమీద పడి మెళు కువ వచ్చింది. నేను లేవటానికి ప్రయత్నిం చాను గాని, నా పాదాలు ఏమాత్రమూ స్వాధీనంలో లేవు, నేను కింద పడిపోయాను. నా స్థితి వర్ణనాతీతం. అయినప్పటికీ అట్లాగే మోకాళ్లమీదా చేతులమీదా పాకుతూ, నడుస్తూ ఒక సమప్రదేశం చేరుకున్నాను. అక్కడ ఫలవృక్షాలున్నాయి, మంచినీటి సెలయేళ్ళున్నాయి.

వాటితో కడుపు నింపుకుంటూ అక్కడే చాలా రోజులు విశ్రాంతి తీసుకుని మెల్లిగా బలం చేకూర్చుకున్నాను. నా శరీరబాధలు క్రమంగా తగ్గసాగాయి. అటూ ఇటూ తిరగటానికిగాను రెండు చంక కర్రలు తయారు చేసుకున్నాను. వీటి సహాయంతో చెట్లమధ్య తిరుగుతూ, పళ్లు తింటూ, ఆలోచిస్తూ, అల్లా మహిమకు ఆనందిస్తూ కాలక్షేపం చేశాను.

ఒకనాడు నేను తీరం వెంబడి నడుస్తూండగా అంతదూరాన నాకేదో జంతువు లాగా కనిపించింది. నేను అత్యాశ్చర్యంతో దానివేపు వెళ్లి అది కట్టేసిఉన్న గుర్రమని తెలుసుకున్నాను. అది మామూలు గుర్రాల లాగా లేదు, చాలా గొప్పజాతిదిగా ఉన్నది. దగ్గిరికి వెళ్లి దానిమీద ఎక్కాలనిపించింది నాకు. కాని నేనింకా దూరంలో ఉండగానే ఎవరో వ్యక్తి భూమిలోనుంచి లేచినట్టు లేచి నావేపు వస్తూ, "ఎవరు నువు? ఎక్కణ్ణుంచి వచ్చావు? ఇక్కడికి రావటానికి ఎందుకు సాహసించావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను సముద్రయానం చేస్తూ మరికొందరితో సహా సముద్రంలో పడిపోయాను. అల్లా నా ప్రాణం కాపాడి మీ దేశంలో తెచ్చి పడేశాడు," అన్నాను.

"నావెంట రా," అంటూ ఆ మనిషి నా చెయ్యి పట్టుకుని భూమి అడుగున ఉండే



ఒక గుహలోకి తీసుకుపోయాడు. లోపల విశాలమైన సావడిలాగా ఉంది. నన్నా మనిషి ఒక గౌరవనీయమైన స్థానంలో కూచోబెట్టి, నాకు భోజనంపెట్టాడు. నా కడుపు నిండాక ఆయన నాకథ అడిగాడు. నేను చెప్పిన కథ యావత్తూ శ్రద్ధగా విని చాలా ఆశ్చర్యపోయాడు.

"నా కథ చెప్పాను. దయచేసి మీకథ కూడా చెబుతారా?" అని అడిగాను. ఆయన ఈవిధంగా చెప్పాడు:

"ఈ దీవిలో నాలాటివాళ్ళం చాలా మందిమి అక్కడక్కడా ఉన్నాం. మీర్జాన్ మహారాజుకు గుర్రాలు సంపాదించి పెట్టటమే మాపని. ప్రతి అమావాస్యనాడూ సముద్రంలోనుంచి ఉత్తమాశ్వాలు తీరానికి మెయ్యటానికి వస్తాయి. వాటిని పట్టుకోవటం మాపని. నిన్ను మీర్జాన్‌మహారాజుదగ్గిరికి తీసుకుపోతాను. మనం కలుసుకోవటం మంచిదయింది. లేకపోతే నీవీ ద్వీపంమీద నిష్కారణంగా చచ్చిపోయేవాడివి."

ఇంతలో మిగిలిన కాసావాళ్ళుకూడా అక్కడికి వచ్చారు. నన్ను ఒక గుర్రం మీద ఎక్కించారు. అందరమూ కలిసి మీర్జాన్‌మహారాజు భవనానికి వెళ్ళాం. కాసావాళ్ళు ముందుగా రాజుకు నన్ను





గురించి చెప్పారు. తరవాత నేనాయన దర్శనం చేసుకున్నాను. నాకాయన ఆద రంతో స్వాగతమిచ్చి నానోటనే నాకథ అంతా విన్నాడు. చివరకాయన, "నాయనా, నీ అయుర్దాయం చాలా గట్టిది. లేకపోతే ఇన్ని ఇక్కట్లు గడిచి ప్రాణాలతో బయటపడవు," అన్నాడు. ఆయన నన్ను తన ఆప్తులలో ఒకణ్ణిగా చేసుకుని, రేవులూ, నౌకావ్యవహారాలూ చూసే పదవిలో నన్ను మంచి జీవితంమీద నియమించాడు.

నా ఉద్యోగంలో తగినంత తీరిక ఉండేది. అందుచేత నేను రాజును రోజూ కలుసుకో గలిగేవాణ్ణి. ఆయన నన్ను తన ఆప్తులలోకెల్లా అగ్రగణ్యుడుగా చూసు కుంటూ, రోజూ ఏదో ఒక బహుమానం ఇస్తూవచ్చాడు. చివరకు నన్ను సంప్ర తించకుండా ఆయన ఏ రాచకార్యమూ చేయని పరిస్థితి ఏర్పడింది.

ఇక్కడ నాకింత సుఖంగా జరుగు తున్నప్పటికీ నేను నా దేశాన్నిగురించి ఆలో చించటం మానలేదు. అక్కడికి తిరిగి పోగలుగుతానన్న ఆశకూడా నన్ను వదల లేదు. "బాగ్దాదు నగరం ఏదిక్కుగా ఉన్నది?" అని నేను ఎందరో నావికులను అడిగిచూశాను. కాని ఒక్కరూ చెప్పలేక పోయారు. వారికసలు ఆ నగరం పేరైనా తెలీదు. అందుచేత, కాలం గడుస్తున్నకొద్దీ నాలో స్వదేశానికి తిరిగిపోవాలన్న ఆరాటం జాస్తి కాసాగింది; తిరిగిపోలేనన్న భయం కూడా తలఎత్తింది.

ఒకనాడు నేను సముద్రతీరాన రేవులో నిలబడి, ఉద్యోగరీత్యా పడవలకోసం చూస్తూండగా, ఒక పెద్ద పడవ రేవు చేరింది. పడవ లంగరు దించి, తాటినిచ్చెన కింద పడవేయగానే నేను పడవమీదికి ఎక్కి సరంగును కలుసుకుని సరుకులు తనిఖీ చేశాను. నా ఎదటనే నావికులు వాటిని బయట పెడుతుంటే నేను జాబితా రాసు



కున్నాను. అంతా అయాక, "పడవలో ఇంకేమీ సరుకు లేదా?" అని సరంగు నడిగాను. "ఉన్నది, బాబూ! అది విక్రయానికి కాదు. అందుచేత అడుగున వేసి ఉంచాను. ఆ సరుకు గల మనిషి సముద్ర మధ్యంలో మునిగిపోయాడు. అవకాశం దొరకగానే దాన్ని అతని బంధువుల పరం చేస్తాను. వారు బాగ్దాదునగరంలో ఉంటారు," అన్నాడు సరంగు.

నా గుండె అతివేగంగా కొట్టుకోసాగింది. "అయ్యా, ఆ మునిగిపోయిన మనిషి పేరేమిటి?" అని సరంగును అడిగాను. "నావికుడు సింద్‌బాద్," అని ఆయన జవాబు చెప్పాడు.

నేనా మనిషికేసి పరీక్షగా చూసి, లోగడ మమ్మల్ని నడిసముద్రంలో వదిలి పడవను తీసుకుపోయిన మనిషి యితడేనని వెంటనే గుర్తించాను.

"నేనే నావికుడు సింద్‌బాద్‌ను!" అని ఒక్క కేకపెట్టాను. తరవాత ఆయనతో నా అనుభవాలు ఉన్నవి ఉన్నట్టు చెప్పేశాను. కాని ఆ సరంగు నా మాటలు నమ్మక, "ఎంత మోసం! ఎంత ఘోరం! నావికుడు సింద్‌బాద్ సముద్రంలో మునిగిపోవటం మేమంతా కళ్ళారా చూస్తిమిగదా, నువ్వే అతనంటావే? అలా అబద్ధమాడటానికి సిగ్గులేదూ?" అని అడిగాడు.

"అబద్ధం ఆడవలిసిన గతి నాకేమిటి? నేనే నావికుడు సింద్‌బాద్‌నని నీకు రుజువు చేస్తాను, చూడు," అంటూ, ఆ తిమింగిలాన్ని భూమి అనుకుని మేము దానిమీద దిగిననాటి వివరాలన్నీ చెప్పాను. చివరకు సరంగు నమ్మక తప్పిందికాదు. ఆయన పడవలో ఉన్న ఇతర వర్తకుల నందరినీ పిలిచి నా విచిత్ర కథ వారికి చెప్పి, నన్ను పరిచయంచేశాడు. నేను చచ్చి బతికి నందుకు అభినందిస్తూ, వారు అల్లా మహిమను ప్రశంసించారు.

తరవాత సరంగు నా సరుకంతా నాపరం చేశాడు. నేను ప్రతి మూటమీదా వేసిన సీళ్లు సరిచూసుకుని, నా సామానులో కొన్ని అమూల్యమైన వస్తువులను మిర్జాన్ మహా రాజుకు బహూకరించటానికి ఉంచి, మిగి లిన సరుకంతా బజారుకు పట్టించుకుపోయి అమ్మేశాను. ఈ అమ్మకంమీద నాకు ఒకటికి నూరింతలు లాభం వచ్చింది.

రాజు ఈ సంగతంతా వినగానే చాలా సంతోషించాడు. ఆయనకు నేనంటే అంత ఇష్టం. నే నిచ్చిన బహుమానాలకు ఎన్నో రెట్లు విలవైనవి ఆయన నాకు ఎదురిచ్చాడు. వీటన్నిటినీ నేను అప్పటికప్పుడే అమ్మేసి నగదుగా మార్చుకుని ఆ డబ్బంతా పడవ లోకి చేర్పించాను. తరవాత ప్రయాణ సన్నాహాలు పూర్తిచేసుకుని, ఆఖరుసారి రాజుగారిని కలుసుకుని, ఆయన నాకు చూపిన దయకు కృతజ్ఞత తెలుపుకున్నాను. నేను వెళ్ళిపోతున్నానని ఆయన చాలా విచారించాడు. ఆయన ఈసారి నాకు అనేకరకాల అత్తరులూ, మంచిగంధం చెక్కలూ, హారతికర్పూరమూ, సాంబ్రాణీ మొదలైనవి బహూకరించాడు. అవి ఆ దీవిలో పుష్కలంగా దొరుకుతాయి. వాటి నన్నిటినీ పడవలోకి పట్టించి ఎక్కాను.

అల్లా దయవల్ల గాలి అనుకూలంగా వీచింది. చాలా రోజులు ప్రయాణించేసి బస్రామీదుగా నా జన్మస్థలమైన బాగ్దాదు నగరం చేరుకున్నాను. అదృష్టవశాత్తూ నా అప్తులందరూ ఆరోగ్యంగా ఉన్నారు. నేను సంపాదించుకు వచ్చిన ధనంతో అనేక భవనాలూ, బానిసలూ, దాసదాసీ జనమూ, పొలాలూ, ఇతర ఆస్తులూ కొన్నాను. మా తండ్రి పోయేనాటికి నాకుండిన ఆస్తిని మించి కొనగలిగాను. తరవాత సమస్త భోగాలూ అనుభవిస్తూ నా తొలి ప్రయా ణంలో పడిన ఇక్కట్లనన్నిటినీ సులువుగా మరిచిపో గలిగాను. (ఇంకా వుంది)



# కింఫలం

ఒక అరణ్యంలో ఒక చెట్టుండేది. అది చూడటానికి మామిడిచెట్టులాగే ఉండేది. దానికి కాసే పళ్ళుకూడా మామిడిపళ్ళలాగే ఉండేవి. వాటి రుచీ, వాసనాకూడా మామిడిపళ్ళను పోలిఉండేది. అయితే అవి విషపు పళ్ళు. అందుచేత ఆ పళ్ళను తెలియక తిన్న ప్రయాణీకులు చనిపోయేవారు. ఆ చెట్టుకు వేరే పేరు లేనందువల్ల దాన్ని కింఫల వృక్షమనేవారు.

ఈ చెట్టు సమీపానే ఒక గ్రామం ఉన్నది. కింఫలాలు విషపూరితమైనవని వారికి తెలుసు. ఎవరైనా ప్రయాణీకులు ఆ చెట్టువద్ద మజిలీ చేస్తే మర్నాడు గ్రామంలోవాళ్ళు అక్కడికి వచ్చి చూసేవారు. ప్రయాణీకులు కింఫలాలు తిని చచ్చిపోయి ఉంటే, వారి డబ్బూ సరుకులూ తీసుకుని గ్రామస్తులు వెళ్ళిపోయేవారు.

ఒకసారి ఒక బిడారు ఆ అడవికుండా వచ్చింది. చెట్టున కింఫలాలు విరగ కాచి ఉన్నాయి. ప్రయాణీకులు వాటిని తినబోయారు. కాని బిడారు నాయకుడు వారిని తిన వద్దన్నాడు. ఆ రాత్రి వారక్కడే మజిలీచేశారు.

మర్నాడు ఉదయం గ్రామస్తులు అక్కడికి వచ్చి ప్రయాణీకు లెవ్వరూ చనిపోక పోవటం చూసి ఆశ్చర్యపడి, "ఈ చెట్టున ఇన్ని పళ్ళుంటే మీరు తిన్నట్టులేదే? కారణం ఏమిటి?" అని అడిగారు.

"నేనే వద్దన్నాను," అన్నాడు బిడారు నాయకుడు.

"ఎందువల్లా?" అన్నారు గ్రామస్తులు.

"ఇవి తినదగిన పళ్ళే అయితే మీ గ్రామంవాళ్ళు వీటిని చెట్టున ఉండనిచ్చేవారా?" అని అడిగాడు బిడారు నాయకుడు.

గ్రామస్తులు సిగ్గుపడి వెళ్ళిపోయారు.



# లోకమాన్య బాలగంగాధర తిలక్

"స్వరాజ్యము నా జన్మ హక్కు!" అర్థ శతాబ్దిక్రితం లోకమాన్య బాల గంగాధర తిలక్ పలికిన ఈ నినాదం ఈనాడు మనదేశంలో అమలులో ఉన్నది. ఈనాడు మనదేశం స్వాతంత్ర్యం అనుభవిస్తున్నది.

1856 జులై 23 న తిలక్ రత్నగిరిలో జన్మించాడు. ఆయన తండ్రిపేరు గంగాధరపంత్, తల్లి పేరు పార్వతీబాయి. ఆయనకు కేశవ అని పేరు పెట్టినప్పటికీ, తల్లిదండ్రులు "బాల" అని పిలిచేవారు. అదే పేరు ఆయనకు స్థిరపడిపోయింది.



బాల గంగాధర తిలక్

ఆయన ప్రాథమికవిద్య రత్నగిరిలోనే జరిగింది. పై చదువుకు ఆయన పూనా వెళ్లాడు. ఆయన సంస్కృతమూ, గణితమూ తన తండ్రివద్దనే నేర్చుకున్నాడు. ఆయన పదవ ఏట స్కూలులో ప్రవేశించినప్పుడు, సంస్కృతం, ఆల్జీబ్రా, జియోమెట్రీలలో ఆయనకు గల పరిజ్ఞానం చూసి ఉపాధ్యాయులు ఆశ్చర్యపోయారు.

కాలేజీ చదువులోనూ, న్యాయవిద్యలోనూ పట్టభద్రుడైనాక, తిలక్ ఉద్యోగంకోసం వెతకలేదు. జాతీయమైన విద్యావిధానాన్ని ప్రచారంలోకి తీసుకురావాలని ఆయనకు ప్రబలమైన కోరిక కలిగింది. ఇందుకుగాను ఆయనతో ఇద్దరు కలిసివచ్చారు— విష్ణుశాస్త్రి చిప్లూంకర్, అగర్కర్. వీరిద్దరి సహాయంతో ఆయన మొదట "న్యూ ఇంగ్లీష్ స్కూల్", తరవాత ఫెర్గ్యూసన్ కాలెజి స్థాపించాడు. ఆయన మహారాష్ట్రభాషలో "కేసరి" అనే పత్రికనూ, ఇంగ్లీషులో "మరాఠీ" అనే పత్రికనూకూడా వ్యవస్థాపించి,

ప్రచురించాడు. ఈ పత్రికలు ప్రజలలో సాగించిన విప్లవకరప్రచారాన్ని చూసి ఆనాటి బ్రిటిష్‌పాలకులు ఎంతగానో బెదిరి పోయారు. ఆ పత్రికలలో వ్రాసిన వ్యాసాల కారణంగా తిలక్‌కు రెండుసార్లు జైలుశిక్ష విధించబడింది.

స్వజాతీయులలో ఐకమత్యం సాధించటానికిగాను తిలక్ రెండు ఏటా జరిపే ఉత్సవాలను ప్రచారంలోకి తీసుకువచ్చాడు—ఒకటి గణపతి నవరాత్రాలు, రెండవది శివాజీ గౌరవార్థం ఏర్పాటైన శివజయంతి. ఇవి సవర్ణ మహారాష్ట్రు లందరూ ఏకంకావటానికి తోడ్పడ్డాయి.

1885 లో స్థాపించబడిన భారత జాతీయ కాంగ్రెసు కొంతకాలంపాటు తిలక్‌ను ఆకర్షించలేకపోయింది. ఆ సంస్థకు విప్లవపూరిత కార్యక్రమం లేకపోవటమే ఇందుకు కారణం. 1905 లో బెంగాలు విభజన జరిగినాక ఆయన ఆ సంస్థలో చేరాడు. దేశీయ స్వాతంత్ర్య సమస్యగురించి ఆయన కాంగ్రెసు సమావేశాలలో చాలాసార్లు ప్రసంగించాడు. విదేశ వస్తు బహిష్కరణోద్యమం కూడా ఆయన ప్రారంభించాడు. రాజకీయోద్యమంలో ఆయనతో కలిసి పనిచేసినవారు లాలా లజపత్ రాయ్, బిపిన్ చంద్రపాల్. వీరిని "లాల్-బాల్-పాల్" అనేవారు.

తిలక్ సాగించిన రాజకీయ చర్యలకుగాను ఆరేళ్ళు ద్వీపాంతర వాస శిక్ష విధించి, బ్రిటిషు వారాయనను మాండలే జైలుకు పంపారు. ఇక్కడ వుండే ఆయన "గీతా రహస్యం" రచించాడు. ఆయన అంతకు పూర్వమే "ఒరెయాన్", "ఆర్క్‌టిక్ హోం ఇన్ ది వేదాస్" అనే గ్రంథాలను రచించి ఉన్నాడు. వాటిని చదివిన మాక్స్ ముల్లర్ పండితుడు విక్టోరియా మహారాణికి ఒక విజ్ఞాపన చేస్తూ, ఆయనను ఖైదులో ఉంచటం అక్రమమన్నాడు.

తిలక్ జైలునుంచి తిరిగి వచ్చేసరికి మొదటి ప్రపంచ యుద్ధం ఆరంభమయింది. డాక్టర్ అనీ బిసెంట్ సాగిస్తున్న "హోం రూల్" ఉద్యమంలో తిలక్‌కూడా చేరి పనిచేశాడు. ఈ సమయంలోనే ఆయనకు "లోకమాన్య" అనే గౌరవ బిరుదం ఇచ్చారు.

భారతీయ చరిత్రలో 1920 ఆగస్టు 1-వ తేదీ ఒక మహత్తరమైన రోజు. ఎందుకంటే, ఆ రోజే మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించాడు. తిలక్ ఈ ఉద్యమంలో చేరాడు. చిట్టచివరకు, తిలక్ కనిన కలలు మహాత్మాజీ ద్వారా వాస్తవ రూపం దాల్చాయి. ఇప్పుడు మన దేశం లోకమాన్య బాలగంగాధర తిలక్ శతవార్షికోత్సవం జరుపుతున్నది.

# బుద్ధి తిరిగింది

ఒక మునీశ్వరుడు రోజూ ఒక రాజువద్దకు వెళ్ళి హితబోధ చేసిపోతూ ఉండేవాడు. ఆ ముని ఒకనాడు రాజుకూతురిని చూసి మోహంలో పడి, తన తపస్సంతా పాడుచేసుకుని, నిద్రాహారాలు మాని తన పర్ణశాలలో వారంరోజులు పడుకున్నాడు.

మునీశ్వరుడు ఎందుకు రాలేదా అని ఆశ్చర్యపడి రాజు ఆయన పర్ణశాలకు వెళ్ళాడు. ముని దాపరికం లేకుండా ఉన్నదంతా రాజుకు చెప్పేశాడు. "స్వామీ, ఇందుకు మీరు విచారించాలా? వచ్చి నా కుమార్తెను పెళ్ళాడండి!" అన్నాడు రాజు. తరవాత ఇంటికి పోయి తన కుమార్తెతో, "అమ్మా, భ్రమలో పడి పండువంటి మహాముని పాడై పోయినాడు. ఈయనను ఈ భ్రమనుంచి తప్పించే భారం నీది! ఈ పని ఇంకెవరివల్లా కాదు!" అన్నాడు.

రాజకుమార్తెను పెళ్ళాడటానికి ముని వచ్చాడు. ఆయనతో రాజకుమార్తె, "నేను నిన్ను పెళ్ళాడతాను కాని మనం ఉండటానికి ఒక గుడిసె కట్టు. గోడలను పేడతో అలుకు. తరవాత అడివికి వెళ్ళి నెలరోజులకు సరిపడే వంటచెరుకు కొట్టి తెచ్చిపడెయ్యి. బావి తవ్వు. నేను కింద పడుకోలేను. మంచం ఒకటి చేసిపెట్టు. రోజూ నాకు స్నానానికి వేడినీళ్లు కాచి పెట్టాలి. నాకు వంటచెయ్యటం చాతకాదు. నువే వంటచెయ్యాలి. వీటన్నిటికీ ఇష్టపడితే మనం పెళ్ళాడదాం," అన్నది.

మహామునికి ఒక్కసారిగా భ్రమ అంతా వదిలిపోయింది. రాజుకూతుర్ని చేసుకుంటే తన దినచర్య ఎట్లా ఉండేదీ అర్థమయింది. ఆయన కళ్లు తెరుచుకున్నవాడై తిరిగి తపస్సు చేసుకునేటందుకు వెళ్లిపోయాడు.



# తగాదా పరిష్కారం

ఒక రైతు కొంత బంజరుభూమిని సాగులోకి తీసుకురావటానికి దున్నుతుండగా నాగలి కర్రుకు ఏదో అడ్డం తగిలింది. రైతు దాన్ని తవ్వితీశాడు. అది బ్రహ్మాండమైన బంగారు దూలం. అది అరటిచెట్టు మందమూ, నాలుగు మూరల నిడివీ ఉన్నది. దాన్ని చూడగానే రైతు తన దరిద్రం తీరిందని ఎంతో సంతోషించాడు.

కాని ఈ సంతోషం క్షణంలో మాయమయింది. ఎందుకంటే ఆ బంగారాన్ని కదిలించటానికికూడా అతని బలం చాలలేదు. అంత బరువు బంగారం ఇంటికి మోసుకుపోవటం ఎట్లా? ఇంకొకడి సహాయం తీసుకుని, బంగారాన్ని రెండుగా కోస్తే సగమైనా దక్కుతుందని, రైతు తన బంధువునొకణ్ణి పిలుచుకువచ్చాడు. ఇద్దరూ కలిసి బంగారాన్ని రెండు తుండాలుగా కోశారు. ఇప్పుడుకూడా ఆ ముక్కలు మోయటానికి అనువుగా లేవు.

ఇద్దరూ కూడబలుక్కుని మరి ఇద్దర్ని తెచ్చారు. బంగారం నాలుగు ముక్కలయింది. ఒక్కొక్క ముక్క మనిషి మోసేపాటిదిగా ఉన్నది. కాని నలుగురూ కలిసి, "నీ వంతు ఎక్కువ వచ్చింది, నా వంతు తక్కువ వచ్చింది!" అని పోట్లాడుకోసాగారు.

త్వరలోనే ఈ పోట్లాట నలుగురికీ తెలిసి, రాజుగారిదాకా పోయింది. రాజభటులు వచ్చి నాలుగు ముక్కల బంగారాన్నీ పట్టుకుపోయి, ఖజానాలో పెట్టేశారు. అంతటితో ఆ నలుగురి తగాదా పరిష్కారమయింది!





# ఇంద్రజాలము

ప్రొఫెసర్ పి. సి. సర్కార్

కొవ్వొత్తిని గాలిలో తేలించటం మంచి ట్రిక్కు. స్టాండు మీద కొవ్వొత్తి వెలుగుతూంటుంది. ఇంద్రజాలికుడు తన రెండు చేతుల వేళ్లు కలిపేసి, అలా కలిపిన చేతులు కొవ్వొత్తిచుట్టూ పెడతాడు. 1 వ బొమ్మలో చూపినట్టు, అతని వేళ్లన్నీ ప్రేక్షకులకు కనిపిస్తాయి. అప్పుడతను చేతులెత్తి కొవ్వొత్తి గాలిలో తేలేలాగా చేస్తాడు. అతను కొవ్వొత్తిని తన చేతులతో ఎలా పట్టగలిగాడో ప్రేక్షకులు ఊహించలేరు.



1



2

కాని రహస్యం చాలా సులువైనది. 2 వ బొమ్మ చూస్తే అది స్పష్టమవుతుంది. మనం చేతివేళ్లను కలిపినప్పుడు ఒక వేలు దాచవచ్చు. వేళ్లను లెక్కిస్తేగాని ఈ సంగతి తెలియదు. నా అనుభవంలో ప్రేక్షకులెప్పుడూ అలా వేళ్లు లెక్కించరు. ఇలా దాచిన వేలి సహాయంతో ఇంద్రజాలికుడు కొవ్వొత్తిని పట్టుకుని గాలిలో తేలినట్టు ట్రిక్కు చేస్తాడు.

[పాఠకులు, యీ గారడీని గురించి మరేవైనా సలహాలు పొందదలిస్తే: ప్రొఫెసర్: పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888 కలకత్తా - 12.]

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 అక్టోబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఆగస్టు 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## ఆగస్టు నెల ఫోటో ఫలితాలు

మొదటి ఫోటో : "చేసేదానం చిన్నదియైనా..."

రెండవ ఫోటో : "పాపాలన్నీ బాపును తల్లీ!"

పంపినవారు : డాక్టర్. వి. పార్థసారథాచార్యులు, (P. O.) ముప్పారంఖుర్ద్, మహబూబాబాద్ (C. Rly.)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

## అట్టచివరి బొమ్మ

ఒకరోజు రాజు - 8

గన్నా తలవాకిలి ముయ్యగానే అబూ లేచికూచున్నాడు. ఇద్దరూ తమ యుక్తికి చాలా సంతోషించారు. "మన పని సగమే అయింది. ఇప్పుడు నువు చచ్చిపో. నేను వెళ్లి సొమ్ము తెస్తాను," అన్నాడు అబూ.

గన్నాకూడా మక్కావేపు కాళ్లు చాచి బిగతీసుకు పడుకుంది. అబూ ఆమెను దుప్పటిలో చుట్టి, తన తలపాగా సగం ఊడదీసుకుని, కళ్ళకు వెల్లుల్లి రుద్దుకుని, బట్టలు చించుకుని శోకమూర్తి లాగా తయారై, ఖలీఫావద్దకు వెళ్లాడు. అతనికేసి ఖలీఫా, జాఫర్, మస్రూర్ మొదలైనవారంతా నిర్ఘాంతపోయి చూసి ఏమి జరిగిందని అడిగారు. అబూ భోరున ఏడిచి రొమ్ము బాదుకుంటూ, "గన్నా! గన్నా! నన్నేంచేసిపోయావు? నేనెట్లా బతికేది?" అని అరవసాగాడు.



ఇంత అకస్మికంగా కొత్త కాపరం విచ్ఛిత్తికావటం తలుచుకుని ఖలీఫాకు కూడా కంట నీరు ఆగలేదు.

"దుఃఖపడకు, తమ్ముడూ. పోయిన దాని ఆయుర్దాయంకూడా అల్లా నీకే ఇస్తాడులే! సుఖపడుతుందని గన్నాను నీకిస్తే నిన్నిట్లా దుఃఖంలో ముంచి వెళ్లి పోయిందా?" అంటూ ఖలీఫా అబూను ఓదార్చాడు.

తరవాత ఆయన తన కోశాధికారిని పిలిచి, ఖర్చులకుగాను పదివేల బంగారు దీనారాలు అబూకు ఇప్పించ మని ఉత్తరువుచేశాడు. అబూ మరొక శోకం పెట్టి డబ్బుతో వెంటనే ఇంటికి తిరిగి వెళ్ళాడు.

భార్యా భర్తలిద్దరూ తాము సంపాదించిన సొమ్ము చూసి మురిసినాక, అబూ భార్యను హెచ్చరించాడు:

"ఇంతటితో ఏమీ కాలేదు. ముందున్నది ముసుళ్ళ పండగ. నిజం బయటపడితే మనం పెద్దల

ఆగ్రహానికి గురికాక తప్పదు. అందు చేత మనం జాగ్రత్తమీద ఉండాలి."

ఖలీఫా ఆరోజు సభ త్వరగా ముగించి, తన ప్రియ పరిచారికను పోగొట్టుకున్న జుబేదాను పరామర్శించ టానికి జుబేదా మందిరానికి వెళ్ళాడు. తలుపు తెరవగానే జుబేదా, ఆమె పరి చారికలూ దిగులుగా కళ్ళు ఒత్తు కుంటూ కనిపించారు.

"నీకు కలిగిన నష్టాన్ని గురించి విన్నాను. పాపం, గన్నాకు ఈ గతి పడుతుందని మనం కలలో కూడా అనుకోలేదు. ఇది నీకుకూడా పెద్ద దెబ్బే!" అన్నాడు ఖలీఫా.

"నాకన్న మీ విచారమే ఎక్కువ. మీరు ఆ అబూ అల్ హసన్‌ను విడిచి ఒక్కక్షణం ఉండలేకపోయేవారు. అతను లేకపోతే, పాపం, మీకేం తోస్తుంది?" అన్నది జుబేదా.

"అల్లా దయవల్ల అతను బాగానే ఉన్నాడుగా! పోయిన గన్నాగురించి విచారించవలసినదానివి నువ్వు!" అన్నాడు ఖలీఫా.

"గన్నా పోవటమేమిటి? ఎవరన్నా నవ్విపోతారు! పోయినవాడు అబూ!" అన్నది జుబేదా.

"నీ అమాయకత్వం చూస్తే నాకు ముందు నవ్వొస్తున్నది. నీకెవరో వార్త తలకిందులుగా చెప్పారు! పోయింది అబూ కాదు, గన్నా!" అన్నాడు ఖలీఫా.

"ఇంకా నయం. మీరే తలకిందు లుగా విన్నారు. పోయింది అబూ!" అన్నది జుబేదా.

చచ్చినవాళ్ళనుగురించి విచారిం చటం మరిచి ఇద్దరూ కోడిపుంజులల్లే విజృంభించారు.

"ఎంత పందెం?" అన్నాడు ఖలీఫా పట్టుదలగా.

"ఎంత పందెం?" అన్నది జుబేదా.

ఖలీఫా మస్రూర్‌ను పిలిచి "నువ్వు తక్షణం అబూ ఇంటికి వెళ్ళి చచ్చి పోయినదెవరో, ఏడుస్తున్నదెవరో చూసి వెంటనే తిరిగివచ్చి చెప్పు!" అన్నాడు.

—(ఇంకా వుంది)





# వార్తలు-విశేషాలు

ఇండియా, అండమానుద్వీపాలమధ్య రాకపోకలను వృద్ధిపరిచేందుకు, భారతప్రభుత్వం రెండు లక్షల నలభై వేల రూపాయలకు ఒక మోటారునౌకను కొన్నది.

*  *  *  *

మన దేశాన్ని చూచేందుకు వచ్చే విదేశ యాత్రికులవల్ల 1951 నుంచి 1955 వరకు, మన దేశానికి లభ్యమైన విదేశమారకం ఆరు, ఏడు కోట్ల రూపాయల మధ్య వుంటుంది. 1951 లో యిక్కడికి వచ్చిన యాత్రికులు 21,000. 1955 లో 45,000 కు మించివున్నారు.

*  *  *  *

కలకత్తాలోని డమ్‌డమ్ విమానాశ్రయంలో రాడార్‌యంత్రం నెలకొల్పబడింది. మనదేశంలోని విమానాశ్రయాలలో ఈ యంత్రాన్ని నెలకొల్పడం ఇదే మొదలు. ఈ రాడార్ యంత్ర సహాయంవల్ల, విమానాశ్రయానికి చుట్టూ 20 మైళ్లలోపున గల వాతావరణాన్ని పరిశీలించి, విమానాలకు సరియైన సూచనలను చేయవచ్చు.

*  *  *  *

ఆంధ్రకోస్తాలో చిన్న రేవులలో ఆగుతూ, హౌరా - బొంబాయిల మధ్య నెలసరి స్టీమర్ సర్వీసును నడపడానికి గల అవకాశాలనుగురించి ఆలోచించబడుతున్నది. ఇందుకు కాగల ఖర్చులు మొదలైన విషయాలన్నింటినీ వివరిస్తూ, ఒక స్కీమును అందజేయవలసిందిగా ఇండియాప్రభుత్వం, ఆంధ్రప్రభుత్వాన్ని కోరింది.



నాగార్జునసాగర్ కాఫర్‌డాం పూర్తయింది. ఇది పూర్తికావటంవల్ల, కృష్ణానదిలో మధ్యవరకు పునాది తవ్వటం ప్రారంభమౌతుంది. డాం నిర్మాణం, రాతికట్టడమా లేక సిమెంటు కట్టడమా అనే విషయం, కమిటీ రిపోర్టు వచ్చినతరవాతగాని నిర్ణయించబడదు.

*　　*　　*　　*

న్యూఢిల్లీలో ప్రభుత్వానికి చెందిన వివిధ భవనాలను తగురీతిగా అలంకరించటానికి ఇండియాప్రభుత్వం నిశ్చయించింది. ఈ అలంకార కార్యకలాపాలద్వారా భారతీయ కళలను కళాకారులను ప్రోత్సహించినట్టవుతుందని ప్రభుత్వోద్దేశం. ఈ నిర్ణయాన్ని అనుసరించి—కుడ్య చిత్రాలు, వర్ణచిత్రాలు, శిల్పాలు మొదలైన అలంకరణల విషయమై ఒక సలహా సంఘం నియమింపబడింది.

*　　*　　*　　*

స్మాల్ సేవింగ్స్ ఉద్యమాన్ని ప్రోత్సహించటానికిగాను ఆంధ్రలో కొత్త ఏర్పాట్లు జరుగుతున్నవి. విద్యార్థులలో పొదుపరితనాన్ని పెంపొందించడానికిగాను ఒక్కొక 'మానిటర్'తో విద్యార్థులను గ్రూపులుగా చేసి, వారికి సేవింగ్స్ కార్డులిచ్చి, వారు మిగుల్చుకున్న డబ్బుతో పోస్టేజిస్టాంపులు కొని కార్డులపైన అంటించుకోవచ్చునని రీజియనల్ ఆఫీసరు సలహా ఇచ్చారు.

*　　*　　*　　*

శ్రీకాకుళం జిల్లాలోని వంశధార ప్రాజెక్టు నిర్మాణానికి సంబంధించిన అన్ని సమస్యలమీదా ఆంధ్ర—ఒరిస్సా ప్రభుత్వాలమధ్య ఒడంబడిక కుదిరింది. దీనివల్ల శ్రీకాకుళం జిల్లాలో 220 వేల ఎకరాలకు నీటివసరు ఏర్పడుతుంది.

*　　*　　*　　*

బాలల చిత్రాలకు కేంద్ర ప్రభుత్వం 25 లక్షల రూపాయలు మంజూరు చేసింది. ప్రభుత్వ ప్రోత్సాహంతో ఏర్పాటు చేయబడిన "చిల్డ్రెన్స్ ఫిలిం సొసైటీ" వారి మొదటి బాలల చిత్రం 'లైట్ హౌస్' నిర్మాణానికి బొంబాయి గవర్నరు డాక్టర్ హరేకృష్ణ మెహతాబ్ ప్రారంభోత్సవం చేశారు.



# చిత్రకథ





ఒక రోజు క్లాసులో పంతులు, పిల్లలందరికీ బొమ్మలు వేయటంలో పోటీ పెట్టాడు. దాసూ, వాసూలు చాలా కష్టపడి, 'టైగర్' బొమ్మ వేశారు. దాన్ని వాళ్ళు గోడకు ఆనించేసరికి, 'టైగర్' వచ్చి దాన్ని కాళ్లతో గీకింది. దాని రంగు లన్నీ, కలగా పులగంగా కలిసిపోయినై. అంతలో పంతులు కేకవేశాడు. అంద రితోపాటు, దాసూ, వాసూలుకూడా తాము వేసిన బొమ్మను పంతులుకు చూపించారు. ఆయన దాన్ని పిల్లలందరికీ చూపుతూ, "చూడండి! సింహం బొమ్మ అంటే యిలా వేయాలి!" అంటూ దాసూ, వాసూలను మెచ్చుకున్నాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26—Controlling Editor: SRI 'CHAKRAPANI'











































సన్‌లైట్ సబ్బు
భారతదేశంలో తయారుచేయబడినది

బట్టలు చాలకాలము
మన్నునట్లు చేయును

S. 238-50 TL



# మల్టీకలర్

ఫొటో ఆఫ్‌సెట్ ప్రింటింగ్‌లోనూ,
ప్రోసెస్ బ్లాకులు తయారుచేయటంలోనూ
సరికొత్త యంత్ర పరికరాలతో
విశేషమైన అనుభవం గల నిపుణులతో

**ఆర్టిస్టులతో, టెక్నీషియనులతో**
**30" × 40" కెమెరా సహాయంతో**

అత్యున్నత ప్రమాణాలను ఎల్లప్పుడూ
నిలబెట్టగల ఏకైక ఆంధ్రసంస్థ
(క్యాలెండర్లకు చక్కని నమూనాలకు,
ముద్రణనుగూర్చి అడగండి.)

## ప్రసాద్ ప్రోసెస్

(ప్రైవేట్) లిమిటెడ్
చందమామ బిల్డింగ్స్
వడపళని :: మదరాసు-26

మూడున్నర రూపాయిలు మాత్రమే



కే డార్

గిరగిర తిరుగును

★ దీని యంత్రసామగ్రి అంతా బలిష్ఠమైనది.
★ గట్టి తగరంతో తయారైన ఈ బొంగరానికి నాలుగు రంగులున్నవి.
★ ఇది తిరుగునప్పుడు మధురమైన శబ్దము చేయును.
★ 4 మొదలు 8 ఏండ్ల వయసు పిల్లలకు చాలా ఉపయోగకరమైనది.
★ ఆకర్షణీయమైన రంగుల పెట్టెలో అన్ని చోటుల దొరకును.

లేదా, మాకు నేరుగా మనియార్డరు పంపండి :-

బాపట్ బ్రదర్స్
295, బజారు రోడ్డు, బొంబాయి - 20.

"గే మిలర్స్"వారి ఆటబొమ్మలు




కే. టి. డోంగ్రే & కంపెనీ,
(ప్రైవేట్) లిమిటెడ్,
బొంబాయి - 4

సువాసన కోరకు సుప్రసిద్ధమైన
దసరా దర్బార్
పుష్పరంజిన్
అగరవత్తులు




మాడర్న్ ఇండియా ట్రేడింగ్ కంపెనీ, బెంగళూరు.2.

అత్యుత్తమ
మైనవే
కావాలనే
జనులు

'బట్టకు బిన్నీనే చెప్పాలి'
అంటారు

కళ, సంగీతము లేక నిత్య జీవిత విషయములు. వీనిలో దేనిలోనైనా ఏది అత్యుత్తమమైనదో పొరపాటు లేకుండా తెలుసుకునే ప్రజ్ఞ కొంత మందికి ఉంది. అటువంటి జనులే గత నూరు ఏళ్లకు పైగా 'బిన్నీవారి బట్టనే' కావాలని కోరుతున్నారు.

దానికి కారణము ఏమంటే, బిన్నీవారి బట్ట, నాణ్యములో దానికి అదే సాటి అని వారికి తెలియును. బిన్నీవారి బట్ట సాటిలేని నాణ్యతకు కారణము పరిశోధన అనుభవము మరియు అత్యుత్తమమైన బట్టలు తయారుచేయాలనే నియమమే.

బిన్నీవారి బట్ట అంటే
నాణ్యమైన బట్ట!



బకింగ్‌హామ్ అండ్ కర్నాటిక్ కంపెనీ లిమిటెడ్
బెంగుళూరు వులెన్, కాటన్ అండ్ సిల్క్ మిల్స్
కంపెనీ లిమిటెడ్
నిర్వహించువారు :
బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్, మద్రాసు



BY. 3461 (A)

Photo by P. K. Patel



బహుమతి పొందిన వ్యాఖ్య

"పాపాలన్నీ బాపును తల్లీ!"

పంపినవారు :
డా॥ వి. పి. ఆచార్యులు, ముప్పారంఖుర్ద్.

